**చందా వివరములు**
బుధవారపు సచిత్ర వారపత్రిక

| | | రూ. | [నయాపైసలు] |
|---|---|---|---|
| సంవత్సర చందా | ... | 18 | 00 |
| అర్ధ సంవత్సర చందా | ... | 6 | 50 |
| విడి ప్రతిక | ... | ,, | 25 |

భారతి (సచిత్ర మాసపత్రిక)

| | | | |
|---|---|---|---|
| సంవత్సర చందా | ... | 13 | 00 |
| అర్ధ సంవత్సర చందా | ... | 6 | 00 |
| విడి ప్రతి | ... | 1 | 00 |

ఆంధ్ర పత్రిక — మద్రాసు-1.

# ఆంధ్రపత్రిక

319517

**చందా వివరములు**
ఆంధ్ర దినపత్రిక

| (ఆదివారపు సంచికతో సహా) | | రూ. | [నయా పైసలు] |
|---|---|---|---|
| సంవత్సర చందా | ... | 28 | 00 |
| అర్ధ సంవత్సర చందా | ... | 14 | 00 |
| 3 మాసముల చందా | ... | 7 | 00 |
| నెల చందా | ... | 2 | 50 |
| విడిప్రతిసాధారణదినములలో | ... | ,, | 7 |
| ఆదివారపు దినపత్రిక | ... | ,, | 20 |

ఆంధ్ర పత్రిక — మద్రాసు-1.

**The Andhra Patrika - Madras** సంపుటం 44. సంచిక 90 FOUNDER: DESODHARAKA K. NAGESWARA RAO సోమవారం 1-7-1957 Reg. No. M. 1118 6 పేజీలు 7 నయాపైసలు


# బియ్యం రవాణా మండలాల ఏర్పాటుకు

## మద్రాసులోని ఆంధ్రులు మద్రాసురాష్ట్ర పౌరులే

### తమిళులతో సమాన సౌకర్యాలు ఉంటాయని సంజీవరెడ్డి ఆశ

మదరాసు, జూన్ 30: "ఇక్కడ వుంటూవున్న ఆంధ్రులను మదరాసు రాష్ట్ర పౌరులుగా భావించి అందరితో పాటు సమాన సౌకర్యాలను ముఖ్యంగా విద్యాలయాల ప్రవేశంలో సర్వసౌకర్యాలను మదరాసు ప్రభుత్వం కల్పించగలదని ఆశిస్తున్నట్లు ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ నీలం సంజీవరెడ్డి చెప్పారు.

మదరాసు ఆంధ్రులు కూడా తాము మదరాసు రాష్ట్ర పౌరులమని భావించటం అవసరం అనికూడా శ్రీ సంజీవరెడ్డి సలహా ఇచ్చారు.

నిన్న సాయంత్రం ఆంధ్ర ప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ నీలం సంజీవరెడ్డి గౌరవార్థం హోటల్ ఏషియానిక్‌లో శ్రీ యార్లగడ్డ రామకృష్ణ ప్రసాద్ అల్పాహారవిందు చేశారు.

విందుకు వచ్చిన వారిలో మదరాసు ముఖ్యమంత్రి శ్రీ కామరాజ నాడార్, సుప్రీంకోర్టు న్యాయమూర్తి గోవింద మీనన్, శ్రీ పాకాల వెంకటరమణారావు, వింగ్ కమాండర్ సత్యనారాయణ, ఆంధ్రపత్రికా సంపాదకులు శ్రీ శివలెంక శంభుప్రసాద్, సహాయసంపాదకులు శ్రీ పండితారాధ్యుల నాగేశ్వరరావు, శ్రీ బండి శ్రీహరిరావునాయుడు ఆంధ్ర వాణిజ్యమండలి అధ్యక్షుడు శ్రీ బి. వేణుగోపాల్, శ్రీ డబ్ల్యు. ఎస్. కృష్ణస్వామి నాయుడు, శ్రీ వి. ఆర్. శార్ల, యింకా అనేకమంది నగర ఆంధ్ర ప్రముఖులు వున్నారు.

శ్రీ రామకృష్ణ ప్రసాద్ ఆంధ్ర ముఖ్యమంత్రికి స్వాగతం ఇస్తూ శ్రీ సంజీవరెడ్డి మదరాసుకు పరాయివారు కాదనీ, వారు సమష్టి మదరాసు రాష్ట్రములో కుమారస్వామి రాజా మంత్రివర్గంలో మంత్రిగా ఉన్నారనీ అన్నారు. అప్పుడు వారు చిన్నదైనా బహుకష్టమయిన మద్యనిషేధశాఖను అతి సమర్థతతో, ప్రజానురంజకంగా నిర్వహించారు. అవసరమైనప్పుడు అధికారాన్ని వదిలి కాంగ్రెసు సంస్థ కార్యక్రమం చేపట్టిన ధీరుడు. ప్రదేశ్ కాంగ్రెసు అధ్యక్షుడుగా వుండి కాంగ్రెసు వ్యవహారాలను ఒక మార్గంలో పెట్టారు. అప్పుడే ఆయనను ఆంధ్రులకు నాయకుడుగా భావించారు. విశాలాంధ్రఏర్పడటంతో విశాల భావాలు గల నాయకత్వం అవసరమైంది. నాయకత్వం ఆయనను వరించింది. ఆయనవద్ద యువకుల అండవుంది. అండవుండట మేమిటి ఆయనే యువకుడు. బొంబాయి ముఖ్యమంత్రి శ్రీ చవాన్ తరువాత దేశంలో చిన్న ముఖ్యమంత్రి ఈయనే. పరిపాలనా దక్షత, విజ్ఞానము గల నాయకుడు సంజీవరెడ్డి. ఇక రాష్ట్రం చూద్దామా సర్వ సమృద్ధమైన రాష్ట్రం. అభివృద్ధికి కార్యక్రమం వున్న నాయకుడు వున్నాడు. బలవంతుడు ఇరుగుపొరుగున వుండటం మంచిది. మదరాసు అల్లా భావిస్తోంది" అని శ్రీ రామకృష్ణప్రసాద్ అన్నారు.

సన్మానానికి కృతజ్ఞత తెలిపి శ్రీ సంజీవరెడ్డి ఇల్లా అన్నారు: "మీరు సన్మానించటానికి నేను సన్మానంపొందటానికి ఎప్పుడు పరాయివాడినయ్యానో నాకు అర్థంకావటంలేదు. నేను ఇక్కడ పెరిగాను. కారణాంతరాలవల్ల

(3 పుట చూడుడు)

### ఇంతవరకూ తేమలని కార్యక్రమం

#### ప్రాంతీయ మండలి సమావేశం

మదరాసు, జూన్ 30: ప్రాంతీయ మండలి సమావేశం జూలై 11 వ జరిగేదీ లేనిదీ ఇదమిత్థంగా తెలియదని శ్రీ నీలం సంజీవరెడ్డి చెప్పారు. అయితే 11 వ తేదీన జరగటానికి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం అంగీకరించిందనీ బట్టి సమావేశం జరుగుతున్నా వీలుచేసుకొని తాము శ్రీ కళా వెంకటరావు, శ్రీ రంగారెడ్డి వస్తామని తెలియజేశామని ముఖ్యమంత్రి చెప్పారు.

రాష్ట్ర పునర్నిర్మాణంవల్ల ఉత్పన్నమైన సమస్యలన్నీ పరిష్కారమైనట్లేనా అనగా "అన్నీ అప్పుడే ఎక్కడ? అవి అల్లాగే వుంటూ వుంటాయి. ఉద్యోగుల సీనియారిటీ జాబితా తయారు చేయవలసి వుంది. అందుకు కొంతకాలం తీసుకుంటుంది." అని అన్నారు.

## ఆంధ్ర సుముఖంకాదు

### అమ్మకునే వస్తువు రాష్ట్రానికి ఇది ఒక్కటే అని సంజీవరెడ్డి వివరణ

### రవాణా ఇబ్బందులవల్ల ధాన్యం మిగిలిఉందే కాని ఏ రాష్ట్రంపట్లా పక్షపాతం లేదు

మదరాసు, జూన్ 30: ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం బియ్యం విషయంలో మండల విధానం అమలు జరపటానికి సుముఖంగా లేదు.

ఇవ్వాళ ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ నీలం సంజీవరెడ్డి పత్రికా ప్రతినిధులతో రవాణా సౌకర్యాలు లేక రాష్ట్రంలో బియ్యం నిల్వ వుండిపోయాయని చెప్పారు.

రాష్ట్ర పునర్నిర్మాణం జరిగిన తరువాత ఆంధ్ర ప్రాంతం నుంచి మదరాసుకు సరిగా బియ్యం రవాణా కావటం లేదేమని ఒకరు అడగ్గా ముఖ్యమంత్రి ఇల్లా చెప్పారు.

"కనీస ధరలు నిర్ణయించి ఖాయిదా చేయనిదే బియ్యం రవాణాలను అదుపు చేయటానికి వీలులేదు. ధర ఎక్కడ ఎక్కువ వస్తే అక్కడ అమ్మకోవటం సహజం. అయినా నాకు తెలిసిన సమాచారంబట్టి లక్షల టన్నులలో బియ్యంమాత్రం ఎగుమతి అయ్యాయి. వాగను సప్లయి సరిగా లేకపోవటమే కారణం అని అనుకుంటాను. రవాణా లేకపోవటమే ప్రధానకారణం. మాకు బియ్యం మిగులు వుంది. అమ్మకోక తప్పదు. ధరలపైకంట్రోలు లేనిదే ప్రభుత్వం బియ్యాన్ని సేకరించటానికి వీలులేదు. బజారులో పోటీపడి ప్రభుత్వం బియ్యం కొనటం మంచిదికాదు. అందువలన ధరలు పెరుగుతాయి.

అండలం పెద్దదిగా వుండాలన్నాం. లేదా ఆంధ్రను ఒక మండలంగా వుంచాలనికోరాం. అందుకు ప్రధానమంత్రి మండలంలో ఇంకొక మండలమూ అవి కూడా అన్నారు. ఆంధ్రప్రదేశ్ అన్నీ దిగుమతి చేసుకోవాలి. ఒక బియ్యాన్ని మాత్రం ఎగుమతి చేస్తుంది. ఆ ఒక్క అవకాశాన్ని కూడా లేకుండా చేస్తే ఆంధ్ర రైతాంగం ఏమి అయిపోతుంది చెప్పండి?

నిరుడు-ఆంధ్రలో కాలమానం బాగుండి విపరీతంగా పండింది, మిగులు-ఆరు లక్షలటన్నులవరకు వుండవచ్చును. అయినా ఈ విషయాన్ని జూలై 3 వ తేదీన ఆహార మంత్రులు హైదరాబాదులో సమావేశమై చర్చించనున్నారు. ఇంతలో నేను ఏమి చెప్పినా బాగుండదు అని శ్రీ సంజీవరెడ్డి అన్నారు.

### అణ్వస్త్ర పరీక్షలు మానినా లాభంలేదు

#### బాంబులు నిర్మించే వీలుందిట

లండన్, జూన్ 29: అణ్వస్త్ర పరీక్షలు మానివేసినా, ఇంతవరకూ పరీక్షలు జరిగిన రకాల అస్త్రాలు అన్నీ నిర్మించడానికి అవకాశం మిగిలే వుంటుంది, అని, నిరాయుధీకరణ ఉపసంఘం బ్రిటిషు ప్రతినిధులలో ఒకరైన కమాండర్ అలన్ నోబుల్ అన్నారు.

పరీక్షల నిషేధంతోపాటు, అణుబాంబులు ఉదజని బాంబులు మొదలైన వాని నిర్మాణానికి అవసరమైన అణు సామగ్రి ఉత్పత్తి నిషేధం కూడా అమలుజరగాలన్నారు.

ఇందువల్లనే పరీక్షలు వెంటనే నిషేధించడానికి ఒప్పుకోవాలని రష్యా ఎందుకు పట్టుబట్టుతున్నదో, ముందు అంతర్యం గ్రహించడానికి బ్రిటన్ ఇంకా ప్రయత్నిస్తూనే ఉన్నదని శ్రీ నోబుల్ చెప్పారు.

### చైనా-దేశరక్షణ వ్యయం తగ్గింపు

పెకింగ్, జూన్ 29: చైనా 1956 లో కంటె 1957 లో దేశరక్షణకు 1. 15% తక్కువ వ్యయం చేస్తుందని, పార్లమెంటులో ఉపప్రధాని, ఆర్థిక మంత్రి అయిన శ్రీ లైహ్సియన్ నియన్ బడ్జెట్ ప్రతిపాదిస్తూ తెలిపారు.

దేశరక్షణకు 1955 కంటె 1956 లో 6% తక్కువ వ్యయం చేశారు.

మొత్తం బడ్జెట్‌లో కిందటేడు 20% ఖర్చుచేశారు; ఈయేడాది 18. 85% మాత్రమే ఖర్చు పెడతారు.

చైనాకు 1957 లో 418 కోట్ల 40 లక్షలు ఆదాయం వస్తుందని అంచనా వేశారు. సుమారు అంతా వ్యయం చేస్తారు.

మొత్తం వ్యయంలో 63. 22% ఆర్థిక నిర్మాణ కార్యక్రమాలను విద్య సంక్షేమం, సాంస్కృతిక శాఖలకు వెచ్చిస్తారు.

## దక్షిణ పరిహద్దుల సమస్యపై పెద్దమనిషి మాటను వినాలి

### 'చాలా ఓర్పుతో ఉన్నాం' అని సంజీవరెడ్డి వెల్లడి

మదరాసు, జూన్ 30: "తగాదా వచ్చింది, తీర్పు చెప్పమని ఒక పెద్దమనిషి నికోరాం, ఆ పెద్దమనిషే తీర్పును అంగీకరించటం పెద్ద మనిషి తరహా. ఈ విషయమై చాలా ఓర్పుతో ఉన్నాం." అని దక్షిణ పరిహద్దులపై శ్రీ పటాస్కర్ విచారణను గూర్చి శ్రీ నీలం సంజీవరెడ్డి చెప్పారు.

శ్రీ సంజీవరెడ్డి ప్రభుత్వ అతిథి గృహంవద్ద పత్రికా ప్రతినిధులతో మాటలాడుతూ పటాస్కర్ తీర్పు ఇవ్వటానికి సంబంధించి నిన్న శాసనసభలో శ్రీ సుబ్రహ్మణ్యం చెప్పింది చూడటం తప్ప ప్రత్యేకంగా తమ కేమీ తెలియదని చెప్పారు.

"మొదటి నుంచీ అన్ని పరిహద్దు సమస్యలూ ఏకకాలంలో పరిష్కారం కావాలన్నాం. బెంగుళూరుకు దగ్గరగా వుందనే కారణంమీద కోలారు పోయింది. హైదరాబాదుకు దగ్గరగావున్న బీదరుమాత్రం మైసూరుకు పోయింది. హైదరాబాదు రాకుండా మైసూరు మంత్రులు బీదరు వెళ్లలేరు. అల్లాగే పర్లాకిమిడి. ఒరిస్సా మంత్రులు పర్లాకిమిడి వెళ్లాలంటే వందమైళ్లు మా రాష్ట్రంలో ప్రయాణం చేయాలి. ఏదైనా గలాటాలూ జరిగితే ఆంధ్ర పోలీసులకు కబురు పెట్టాలి. అయినా అది ఒరిస్సాలోవుంది. కనుక పరిహద్దు సమస్యలన్నీ ఒకేసారి విచారించాలన్నాం. కాదు కూడదు అంటే దక్షిణ పరిహద్దు సమస్య పరిశీలనకు అంగీకరించాం. హోసూరు వివాదాంశం కాదన్నారు. అల్లాగైతే తిరుత్తణి కూడా వివాదాంశం కాదన్నాం. చివరికి హోసూరుగురించికూడా విచారించటానికి మదరాసు ఒప్పుకున్న మాదట అంగీకరించాం. ఏదోఒక దాన్ని పట్టుకుని హోసూరు పరిహద్దు కాదన్నారు. వేపనపల్లిఫిర్కా హోసూరు తాలూకాలో భాగమని చెప్పటానికి 1921 సంవత్సరం గెజెటును పట్టుకొని పంపాల్సి వచ్చింది."

"నాకు ఏ ప్రాంతంమీదా ఆశలేదు. ఏ ప్రాంతాన్నిగూర్చీ నాకు ఆందోళన లేదు. మాది పెద్ద రాష్ట్రం. అయితే అడిగేది లేనిదిగా వుండకూడదు. అడిగే దాంట్లో న్యాయం వుండాలి. అయిన దానికీ కానిదానికీ పేచీ పెట్టుకు కూర్చుంటే బాగుండదు. రాష్ట్రం విడిపోయిన తరువాత పేచీలకు అవకాశం లేకుండా మా వాళ్ళు ప్రశాంతంగా వున్నారు. మావాళ్లకు అసలే ఆవేశం ఎక్కువ. అనవసరంగా వత్తిడి తీసుకువస్తే సర్దుబాటు చేయటం కష్టం అవుతుంది." అన్నారు.

ఇల్లాంటి విషయాలను ప్రాంతీయ మండలి పరిశీలించవచ్చుకదా అనగా "సరిహద్దు సమస్యలను ప్రాంతీయ మండలికి తీసుకొని నడిపితే దాంతోనే కాలం సరిపోతుంది. ఇంకో పని ఏమీ జరగదు" అని అన్నారు.

గోదావరి జలం వినియోగంలాంటి సమస్యలను ప్రాంతీయ మండలి పరిశీలించవచ్చని శ్రీ సంజీవరెడ్డి చెప్పారు.

## గోదావరి నీటిని దక్షిణానికి తెచ్చే సమస్య

### కృష్ణలోకి ఏచోట పారించాలా అనేది జరగవలసిన పరిశీలన

మదరాసు, జూన్ 30: 'గోదావరి నీటిని దక్షిణాదికి తీసుకొనిరావటం ఎంతవరకు ఆచరణసాధ్యమో సమగ్రంగా పరిశీలించవలసిన విషయం. కృష్ణనుంచి అయితే తేలిగ్గా దక్షిణాదికి నీరు తీసుకొని రావచ్చును. కాని కృష్ణలో నాగార్జునసాగరం, సిద్ధేశ్వరం ప్రాజక్టులను నిర్మిస్తున్నందున నీరు ఏమీమిగలదు. ఇక పోతే గోదావరే శరణ్యం. అది ఎప్పటికి సాధ్యమౌతుందో ఇప్పుడు చెప్పలేను అని ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ నీలం సంజీవరెడ్డి పత్రికా ప్రతినిధులతో చెప్పారు.

ఈ సందర్భంలో వారు ఇంకా ఇల్లా అన్నారు: "కొంతమంది ఆచరణ

(3 వ పుట చూడుడు)

## మద్రాసులో తెలుగువారి విద్యాసౌకర్యాలు

### కామరాజుతో చెప్పండి అని సంజీవరెడ్డి సలహా

మద్రాసు, జూన్ 30: మదరాసు ఆంధ్రులకు విద్యాసౌకర్యాల విషయంలో మద్రాసు ముఖ్యమంత్రితో మాట్లాడతారా అనగా ప్రత్యేకమైన ఇబ్బంది ఏమైనా వుంటే ముఖ్యమంత్రిని కలుసుకొని విన్నవించుకోవాలని ఆయన వింటారనీ,-శ్రీ సంజీవరెడ్డి సలహా ఇచ్చారు. మదరాసులోవుండే-ఆంధ్రులను మదరాసు పౌరులుగా పరిగణించి ఇతర రాష్ట్రాలకుచేసే స్థానాల కేటాయింపులో నిమిత్తం లేకుండా విద్యాసంస్థలలో చేర్చుకోవటం న్యాయం అని అన్నారు.

తాము హైదరాబాదులో ఉన్న అసంఖ్యాక మహారాష్ట్రులకూ, కన్నడులకూ, ముస్లిములకూ తగు విద్యాసౌకర్యాలు చేసి కొనసాగిస్తామనీ, అలాగే మద్రాసులోనూ జరగాలనీ, రాష్ట్రాలు వేరైనంతమాత్రాన ఎవ్వరికీ అన్యాయం జరగరాదనీ శ్రీ సంజీవరెడ్డి అన్నారు.

### ఆదిమజాతుల కష్ట నిష్ఠూరాలు

న్యూఢిల్లీ, జూన్ 29: ఆదిమజాతుల కష్టనిష్ఠూరాలను గురించి, సమస్యలను గురించి పని చెయ్యడానికి, వేరే ఉద్యోగి వర్గాన్ని ఏర్పాటు చెయ్యడాన్ని గూర్చి ఆలోచనలు జరుగుతున్నట్లు, రాష్ట్రపతి డా॥ రాజేంద్రప్రసాద్ నేడు విశదం చేశారు.

భారతీయ ఆదిమజాతి సేవకసంఘం సర్వసభ్య సమావేశం నేడు రాష్ట్రపతి భవనంలో జరిగింది. ఈ సభలో రాష్ట్రపతి మాట్లాడారు. ఆయన ఈలా అన్నారు:

"ఆదిమజాతుల అభివృద్ధికోసం జరుగుతున్న పని ఏదో జరుగుతోందిగాని, అది సంతృప్తిగా లేదు. అయితే ఇది డబ్బు లేక కాదు. పని చేసేవాళ్లు సరియైన వాళ్లు లేనందువల్ల జరుగుతోంది. ప్రభుత్వం ఇచ్చే డబ్బు చాలకపోతే, గాంధీ స్మారక నిధిలోంచికూడా ఈ కార్యక్రమానికి డబ్బు లభిస్తుంది."

## 'మన లిపి పుట్టుపూర్వోత్తరాలు'

### తిరుమల రామచంద్ర పరిశోధక గ్రంథ ఆవిష్కరణ

మద్రాసు, జూన్ 30: శ్రీ తిరుమల రామచంద్ర తాము వ్రాసిన "మన లిపి పుట్టుపూర్వోత్తరాలు" అనే పరిశోధక గ్రంథాన్ని ఈ ఉదయం ఆంధ్ర చారిత్రక పరిశోధక ప్రముఖులైన శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మకు అంకితమిచ్చారు. డా॥ రాయప్రోలు సుబ్రహ్మణ్యం గ్రంథాన్ని ఆవిష్కరించారు. ఇంత మహావిషయాన్ని సరళమైనభాషలో వివరించ గలిగినందుకు శ్రీ రామచంద్రను శ్రీ తాపీ ధర్మారావు అభినందించారు.

సామాన్య భాషాజ్ఞానం కలిగిన నాకే అర్థమవుతున్నది అంటే అందరికీ అర్థమవుతుంది అన్నమాట. ఇంత గొప్ప విషయాన్ని ఇలా సులభ శైలిలో వ్రాయడం ఆనందించదగిన విశేషం—అన్నారు శ్రీ నీలం సంజీవరెడ్డి.

శ్రీ మల్లిక్ ప్రార్థనగానం చేసిన తర్వాత శ్రీ తిమ్మాజ్ఝల కోదండరామయ్య అతిథులకు స్వాగతం చెప్పారు. సభకు శ్రీ వి. ఆర్. శార్ల అధ్యక్షత వహించారు.

#### పండితులకూ పామరులకూ ఉపకరించేది

డా॥ రాయప్రోలు సుబ్రహ్మణ్యం గ్రంథాన్ని ఆవిష్కరిస్తూ, శ్రీ రామచంద్ర వ్రాసిన అంశంపై ఇంతకుముందు బర్నెల్, శివరామమూర్తి, ఓఝా మొదలైన పండితులు వ్రాసిన గ్రంథాలుతప్ప వేరే వివరణ రచనలు లేవనీ, అవైనా పండితులకే ఉపకరించే గ్రంథాలనీ అన్నారు. రామచంద్రగారు చేసిన రచన పండితులకూ పామరులకూ కూడా అందుబాటులో ఉంటేదని అంటూ శ్రీ సుబ్రహ్మణ్యం వివిధ లిపులకు (అక్షరాలకు) తగుఅర్థాన్ని వుదర్చడంలో పండితులమున్న భేదాభిప్రాయాలున్నాయనీ, మొహంజోదారో హారప్పలవద్ద లభించిన నాణెములపైనా రాళ్ళపైనా, రేకులపైనా కనపడుతున్న లిపి వేదకాలపునాటిదని తమ విశ్వాసమనీ అన్నారు. శ్రీ రామచంద్రవ్రాసిన లిపి సిద్ధాంతాలను వివరణలనూ ఒప్పుకొనడానికి పండితులకు మరో యాభై ఏళ్ళయినాపట్టుందని శ్రీసుబ్రహ్మణ్యం భావించారు. ఇలాంటి ఉత్తమ పరిశోధక గ్రంథాన్ని సరళంగా వ్రాసినందుకు శ్రీ రామచంద్రను అభినందించారు.

శ్రీ రామచంద్ర తమ కృతిని శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మకు కృతి ఇస్తూ, తమ పరిశోధనకు దోహదం చేసిన తాపీ ధర్మారావుగారికీ, సోమశేఖర శర్మగారికీ కృతజ్ఞత తెలియజేశారు. "ప్రాచ్య పాశ్చాత్య పండితులు లిపి పరిణామం గురించి చెప్పిన సంగతులు క్రోడీకరించి భారతీయ దృక్పథంలో చెప్పడమే నేనీ పుస్తకంలో చేసినపని. చదువు వ్రాత నేర్చిన ప్రతివారూ లిపి సంగతి తెలుసుకోవడం అనేదే ఈ పుస్తక పరమార్థం. కనుక శాస్త్ర పరిభాష వదలి సరళంగా

(3వ పుట చూడుడు)

### నిరాయుధీకరణ ఉపసంఘం

లండన్, జూన్ 29: సోమవారంనాడు సమావేశం కావలసిన సమితి నిరాయుధీకరణ ఉపసంఘం మంగళవారానికి వాయిదా పడింది.

ఇందుకు కారణాన్ని అధికారులు తెలపలేదు.

కాని సోమవారంనాడు కెనడా జాతీయోత్సవం ఒకటుంది. ఆరోజునే కాముస్వార్త ప్రధాన మంత్రుల రెండోసారి నిరాయుధీకరణ సమస్యను చర్చిస్తారు.

ఇవిగాక, అట్లాంటిక్ మండలి ప్రతినిధులతో పారిస్‌లో అమెరికన్ ప్రతినిధి శ్రీ స్టాసెన్ సాగిస్తున్న చర్చలకు ఇంకో రోజు వ్యవధి లభిస్తున్నది.

### లూసియానాలో ఉప్పెన: 250 మంది మృతి

లేక్ చార్లెస్, జూన్ 29: అమెరికాలో లూసియానా రాష్ట్రంలో ఉప్పెనవచ్చి జననష్టం బాగా జరిగింది. మొత్తం 250 మంది చనిపోయారు.

ప్రభుత్వం ఆతీర ప్రాంతంనుంచి 2 వేల జనాభాను వేరేచోట్లకు చేర్చారు.

ఉప్పెన బాధితులకు అమెరికా కేంద్రప్రభుత్వం సహాయం చేస్తుందని శ్రీ ఐసెన్‌హోవర్ ఒకప్రకటనచేశారు.

## ఆంధ్రప్రదేశ్ మైకా చట్టం
### రాష్ట్రపతి ఆమోదం

హైదరాబాదు, జూన్ 29: ఆంధ్రప్రదేశ్ మైకా చట్టానికి రాష్ట్రపతి ఆమోదం తెలిపినట్లు యివాళ గెజెటులో ప్రకటన వెలువడింది.

దగ్గర ఉంచుకోదగిన మైకా పరిమాణాన్ని, మైకా రవాణాను, క్రమబద్ధం చేయడానికి యిటీవల, రాష్ట్రశాసనసభ యీ చట్టం చేసింది. ఈ చట్టం ప్రకారం మైకా దగ్గర ఉంచుకోవాలన్నా, విక్రయించాలన్నా లైసెన్సు అవసరం. మైకా రవాణాకుకూడా అనుమతులు పొందాలి.

ప్రభుత్వానికి నజరానా (రాయల్టీ) చెల్లించని ప్రాంతాలనుండి, నజరానా చెల్లిస్తున్న ప్రాంతాలకుదొంగచాటుగా మైకా రవాణా కాకుండా నిరోధించడం యీ చట్టం ఉద్దేశ్యం.

---

గుంటూరు, జూన్ 27: గుంటూరు కళాశాలల్లో చదివే పేదవిద్యార్థులకు అరండలుపేటలోని శ్రీ రామకృష్ణ బ్రాహ్మణ విద్యార్థి వసతిగృహంలో వసతి ఇస్తారు. కొద్దిమంది విద్యార్థులకు ఉచిత భోజనవసతి కూడా ఇస్తారు. దరఖాస్తులను వసతిగృహం పాలకవర్గానికి పంపించాలి.

---



---

# మూడు నెలలపాటు ఓపెన్ జనరల్ లైసెన్సుల పద్ధతి రద్దు
## జులైనుంచి సెప్టెంబరుదాకా ప్రభుత్వ దిగుమతి విధానం

న్యూఢిల్లీ, జూన్ 29: 1957 జులైనుంచి సెప్టెంబరుదాకా జరిగే, దిగుమతి వ్యాపారానికి ఇప్పుడు ఆ వ్యాపారంలో వున్నవారి లైసెన్సులు ఇవ్వరు. అయితే వీరు, తమ లైసెన్సులను పొడిగించవలసిందిగా, దరఖాస్తులు పెట్టుకోవచ్చు. ప్రభుత్వం ఇట్టి దరఖాస్తులను పరిశీలిస్తుంది. అంతేగాని, ఓపెన్ జనరల్ లైసెన్సులపద్ధతి అంటూ మాత్రం ఈ మూడు నెలలు వుండదు. రద్దయిపోతుంది.

ఈ విషయాలు స్పష్టంచేస్తూ ప్రభుత్వం నేడు ఒక ప్రకటన చేసింది. ఇందులో ఇల్లావుంది. వచ్చే మూడు నెలలలో యంత్రాలు, అవి దిగుమతులు చేసుకునేందుకు లైసెన్సులు ఇవ్వరు. ఖనిజాలను, ముడిపదార్థాలను గూడా లైసెన్సులు ఇవ్వరు. పూర్వం వీటికని తీసుకున్న లైసెన్సులకే ఇవి మిగిలివున్నాయి. ప్రస్తుతంవున్న ఓపెన్ జనరల్ లైసెన్సులలోనే, ఈ రకం సామానులు బాగా దిగుమతి అయినందువల్ల, ఇప్పుడు ఆ ఓపెన్ జనరల్ లైసెన్సులుగూడా ఇవ్వరు."

ప్రభుత్వం, ఈ దిగుమతి విధానంలో ఈ మార్పులు చెయ్యడానికి అయిన కారణాలను అధికారులు ఇట్లా వివరిస్తున్నారు." ఇందువల్ల మన జమకు వున్న విదేశీద్రవ్యం దుబారా కాకుండా చూడాలని చూస్తున్నాము. ఈ సంవత్సరం ఆరంభంలో రు 580 కోట్లుగా వున్న మన స్టెర్లింగు నిల్వలు ఇప్పుడు 467 కోట్ల దగ్గరకు దిగజారాయి.

"ఇప్పుడు ప్రభుత్వం వ్రాస్తున్న ఈ పనివల్ల వస్తుకొరత ఏర్పడుతుందనే భయం అనవసరం. దేశానికి కావలసిన సరుకులు పుష్కలంగా దిగుమతి అయి వున్నాయి. ఇప్పుడు వున్న లైసెన్సులతో ఇంకా దిగవలసిన సరుకులు వున్నాయి ఈ పాత లైసెన్సులద్వారా ఇంకా దాదాపు 420 కోట్ల రూపాయల సరుకు విదేశాలనుంచి దిగుమతి కావలసి వుంది.

"విదేశాలనుంచి మనం తెప్పించుకో వలసివున్న ముడిద్రవ్యాలకు పూర్వం ఇస్తున్నట్టే అసలు వాడకందార్లకు లైసెన్సులుఇచ్చేపద్ధతే చెల్లుతుంది. కాని దరఖాస్తులను ఇవ్వడంలో మాత్రం పరిశీలనం అన్ని గట్టిగా వుంటాయి.

"పత్రికలవారికి కావలసిన న్యూస్ ప్రింటు దిగుమతులవిషయంలో ఆ పత్రికలవారు స్వచ్ఛందంగా, వాడకాన్ని తగ్గించుకోడానికి అంగీకరించారు."

ఈ విధానం వచ్చే మూడు నెలలకు మాత్రమే చెల్లుతుంది. ఇందుకు కారణం వుంది. ప్రభుత్వం ఇకముందునుంచీ, ఈ దిగుమతుల లైసెన్సులు ఇచ్చే కాలాన్ని కాబరునుంచిమార్చిదాకాను, ఏప్రిల్ నుంచి సెప్టెంబరుదాకాను, విభాగించి నిర్ణయాలుచేస్తూ వుంటుంది. 1958 మార్చి-అక్టోబరు కాలం దిగుమతి విధానాన్ని సెప్టెంబరు అంతంలో ప్రకటిస్తారు, అప్పటికి విదేశీ ద్రవ్యం స్థితిగతులు ఒక్క రూపానికి వస్తాయి.

ఇప్పుడు ప్రభుత్వం జారీచేసిన ప్రకటనలో ఈ విషయాలు గూడా వున్నాయి: "రుత్తనాగము, సీసము, తగరము, రాగి, నికెల్ ఫెర్రోక్రోమ్, అల్యూమినము, ఎలక్ట్రోడులు, తోళ్లు చర్మాలు, గంధకము, అశ్మభాస్వరము, వున్న మొదలైన సరుకులకు వాడకం దార్లకు మాత్రమే లైసెన్సులు ఇవ్వాలి. అందుచేత వీటికోసం దరఖాస్తులు వచ్చినప్పుడు, వాటిని, అధికారులు జాగ్రత్తగా పరిశీలించాలి.

"దేశానికి విదేశీ ద్రవ్యం విషయమై కటకట ఏర్పడినా, పరిశ్రమలు దెబ్బ తినరాదనే, ప్రభుత్వం భావిస్తోంది. అందుకోసమే పారిశ్రామిక వస్తూత్పత్తికి అవసరమైన ద్రవ్యాలను తెప్పించుకోడానికి ఆట్టే అడ్డంకులు ఏమీ పెట్టడంలేదు. అవసర వస్తు సామాగ్రికి, వాడకం దార్లకు, పూర్వం ఇచ్చినట్టే ఇప్పుడు లైసెన్సులు ఇస్తారు. అయితే, అందులో దేశంలో దొరికే సరుకువుంటే మాత్రం, ఇవ్వరు.

"వాయిదా చెల్లింపు పద్ధతులమీద, పెట్టుబడి సరుకుల దిగుమతికి లైసెన్సులు ఇస్తారు. విదేశీ ద్రవ్యాన్ని పొదుపు చేసే పరిశ్రమలకు, అర్జించే పరిశ్రమలకు దిగుమతి లైసెన్సులు ఇవ్వడానికి బాధ ఏమీ వుండదు. యంత్ర పరికరాలకు, పూర్వం నుంచీ దిగుమతిదార్లుగా వున్న వారికి తాత్కాలిక ప్రాతిపదికను, లైసెన్సులు ఇస్తారు.

"విదేశీ ద్రవ్యం పొదుపుకు ప్రభుత్వం ఈ పనులు చేస్తున్నది. ఇందులో పారిశ్రామికులను, వ్యాపారులను, సహాయ సహకారాలను అర్థిస్తోంది. తమ వద్ద వున్న సరుకును, వీరు, సరసమైన ధరలకు, మార్కెట్లకు ఎక్కిస్తారని ఆశిస్తున్నది."

## రామచంద్రపురం పంచాయతీ

రామచంద్రపురం, జూన్ 27:— నిన్న జరిగిన రామచంద్రపురం పంచాయతీబోర్డు సమావేశంలో రు 51 వేల పనులను మంజూరు చేశారు. శ్రీ పిల్లా లోవరాజు అధ్యక్షత వహించారు. 6 వేల అడుగుల పొడవుగల 4 రోడ్లకు తారువేయడానికి అంచనాలను తయారు చేయవలసినదిగా ఇంజనీరింగు శాఖను పంచాయతీబోర్డు కోరింది.

---

## కామన్వెల్తు ఆర్థిక సమస్యలు
### భారత దేశంపై పాక్ దుష్ప్రచారం

న్యూఢిల్లీ, జూన్ 29: కామన్వెల్తు ప్రధాన మంత్రులు ఆర్థిక సమస్యలను చర్చించేటప్పుడు, శ్రీ నెహ్రూ సలహాదారులతోపాటు కలిసి చర్చలలో పాల్గొనడానికి, భారతప్రభుత్వ ఆర్థిక శాఖ ముఖ్య కార్యదర్శి శ్రీ హెచ్. యం. పటేల్ ఇవాళ ప్రయాణమై లండన్ వెడుతున్నారు.

చర్చకు వచ్చే వానిలో రెండు ముఖ్యాంశాలున్నాయి. 1. యూరోపియన్ రాజ్యాల స్వేచ్ఛా వ్యాపార వ్యవస్థ 2. కామన్వెల్తులోని పేదదేశాల ఆర్థికాభివృద్ధి.

యూరోపియన్ వ్యాపారం విషయంలో ఆ కార్యక్రమం స్వరూపం పూర్తిగా తెలిస్తేగాని ఏ విషయం చెప్పడం కష్టం అని భారతదేశం అభిప్రాయం. ఈ కార్యక్రమంలో వలస దేశాలనుకూడా చేర్చుతున్నందువల్ల, కొన్ని రక్షణలు అవసరం అని కూడా భారతదేశం అభిప్రాయం.

స్టెర్లింగ్ ప్రాంత దేశాల ఆర్థికాభివృద్ధి సమస్య ఉంది.

ప్రస్తుతం భారతదేశానికి స్టెర్లింగ్ నిలవలు రు. 400 కోట్ల విలువకు తరిగిపోయినందువల్ల, భారతీయ ద్రవ్య చలామణికి మూలాధారంగా ఇది కనిష్ఠ ప్రమాణమైనందువల్ల, ఇంక భారతదేశానికి బ్రిటన్ బ్యాంకర్ గా వ్యవహరించే వీలు ఉండకపోవచ్చు.

బ్రిటన్ ఆర్థిక పరిస్థితినిబట్టి, ఆ దేశం వల్ల భారతదేశానికి పెద్దగా ఆర్థిక సహాయం లభించడం కష్టం. అయితే, బ్రిటన్ ఉన్నంతలోనే, భారతదేశం విదేశీద్రవ్య నిధులను మరింత తరిగించు నవసంలేకుండా, ఏదో కొంత సహాయ పడవచ్చు.

### ఆర్థిక సుస్థిరతేకాదు; అభివృద్ధికూడా ముఖ్యం

స్టెర్లింగ్ ప్రాంతం భవిష్యత్తు కేవలం ఆర్థిక సుస్థిరతపైనేకాదు, పేదదేశాల అభివృద్ధిపై కూడా ఆధారపడి ఉంటుందని బ్రిటన్, ఇతర కామన్వెల్తు రాజ్యాలుకూడా గుర్తించుకోడం అవసరమని భారతదేశంలో పరిశీలకులు అంటున్నారు.

ఇతర కామన్వెల్తు రాజ్యాలు భారతదేశానికి ప్రత్యక్షంగా సహాయపడలేకపోయినా, పాకిస్తాన్ సాగిస్తున్న దుష్ప్రచారానికి మాత్రం మద్దతివ్వకూడదని వీరి అభిప్రాయం.

ఇతర రాజ్యాల ఆర్థిక ఆధారాలను భారతదేశం చిత్తం వచ్చినట్లు అపవ్యయం చేస్తున్నదని పాకిస్తాన్ ప్రచారం చేస్తోంది. ఈ ప్రచారానికి సై అవకుండా ఉండేచాలు.

## కాశ్మీర్, నదీజలాల చర్చకు తావులేదు
### బ్రిటన్ మధ్యవర్తిత్వంపై నమ్మకంపోయింది

లండన్, జూన్ 29: బ్రిటన్, పాకిస్తాన్ ప్రధానమంత్రులు ప్రత్యేకంగా కలుసుకుని కాశ్మీర్ సమస్యను, పంజాబు నదీజలాలసమస్యను చర్చించారని, పాకిస్తాన్ ప్రతినిధివర్గం ప్రకటించడం ప్రచారానికే, అని ఇక్కడ సామాన్యంగా భారతీయ దృక్పథం తెలియపరిచేవారు అంటున్నారు.

ఈ ప్రచారానికి అంతర్యం ఏదైనా కావచ్చుకాని, నిత్యం బ్రిటన్‌ను మధ్యవర్తిగా కూర్చోపెట్టుకుని పాకిస్తాన్‌తో తగవులను లండన్‌లోచర్చించడానికి భారత ప్రతినిధివర్గంమాత్రం ఒప్పుకోదనేమాట రూఢి.

భారతదేశంపట్ల సుముఖభావం ఆట్టే కనపడదని, లండన్ "టైమ్స్" పత్రికకూడా, ఇంకే కారణంఉన్నా లేకపోయినా పాకిస్తాన్‌లో పరిస్థితుల మూలంగా, ప్రధాని శ్రీ సుహ్రావర్ది కాశ్మీరు సమస్యను తీసుకురాక తప్పకపోవచ్చు, అని వ్రాసింది. కాశ్మీరు, పంజాబు నదీజలాలసమస్యలు రెండింటి పరిష్కారానికీ తోడ్పడ్డమే బ్రిటన్ కోరిక, కనీసం రెండురాజ్యాల మధ్య వైమనశ్యాలు మరీ పెరిగిపోకుండా చూడ్డమే బ్రిటన్ అభిమతం అనికూడా ఆ పత్రిక వ్రాసింది.

అయితే,భద్రతామండలిలో బ్రిటన్ చూపిన వైఖరి మూలంగా,ఇంక కాశ్మీరు సమస్యపై వైమనశ్యాలు రెచ్చకుండా చూడ్డంలో సహాయపడేఅర్హత, సమర్థత బ్రిటన్‌కు మిగలలేదని భారతపరిశీలకులు అభిప్రాయపడుతున్నారు.

పంజాబు నదీ జలాల విషయంలో ఏమైనా బ్రిటన్ కొంత సహాయపడగలదేమో. ఆ నదీజలాలను పంజాబులో సేద్యానికి వినియోగించడానికి బ్రిటన్ అధికారంలోఉండగా ఆనకట్టలు మొదలైనవానితో ఒక పథకం తయారుచేసింది. అందువల్ల యీసమస్య కొంత బ్రిటన్‌కు అవగాహనే కాబట్టి సహాయ పడవచ్చునేమో.

### ప్రధానుల అంతరంగికగోష్ఠి

లండన్, జూన్ 29: కామన్వెల్తు ప్రధానమంత్రులు ఇవాళ బకింగ్ హాంషైర్ లోని బ్రిటిష్ ప్రధాని నివాసభవనం "చెకర్స్" లో కొంత కొంతమంది చొప్పున విడివిడిగా అంతరంగిక గోష్ఠి సాగించారు.

నిన్నరాత్రివచ్చిన వారు అప్పుడే ఇవాళ మధ్యాహ్నం వెళ్ళిపోగా కొంతమంది చేరుకున్నారు.

భారతప్రధాని శ్రీ నెహ్రూ కారులో 'చెకర్స్' నుంచి మౌంట్ బాటెన్ దంపతుల నివాసానికి కారులో వెళ్లారు.

కామన్వెల్తు ప్రధానమంత్రుల సమావేశం మళ్లీ సోమవారంనుంచీ ప్రారంభమౌతుంది.

### చైనా సైన్యంతో బర్మా పోలీసుల సంఘర్షణ

రంగూన్, జూన్ 29: ఉత్తరబర్మా సరిహద్దు ఒక గ్రామంలో బర్మాపోలీసులు, చైనా సైనికులు ఒకళ్ళపై ఒకళ్లు కాల్పులు జరుపుకొన్నట్లు యివాళ యిక్కడికి వార్తచేరింది. ఈ సంఘటన రెండు వారాలక్రితం జరిగిందట. ఆ గ్రామం సగం చైనాది,సగం బర్మాది. ఒక బియ్యం మిల్లులో అక్రమంగా ప్రవేశించిన చైనావారిని బర్మాపోలీసులు తనిఖీచేస్తుండగా, చైనా సైనికులు కాల్పులు మొదలు పెట్టారని, బర్మాపోలీసులు ఎదురుకాల్పులు జరిపి, తమ కొంత స్థావరానికి తిరిగిపోయారని తెలిసింది.

క్రిందటేడు బర్మా అధికారులు, అక్రమంగా కలసివచ్చిన 19 మంది చైనావారిని అరెస్టుచేశారు కాని చైనా సైనికులు బర్మాపోలీసు కావలాస్థావరంపై దాడి చేస్తామని బెదిరించగా, ఆ 19 మందిని వదలివేశారు.

---

# అధికాహారోత్పత్తికి రైతులతో చర్చలు
## త్వరలోనే వివిధరాష్ట్రాలలో జైన్ పర్యటనం

న్యూఢిల్లీ, జూన్ 29: దేశంలో ఆహారోత్పత్తిని అధికం చేసేందుకు వీలుగా, అధికాహారోత్పత్తి పథకాలను ఎట్లా అమలు జరిపితే బాగుంటుందో, రైతు పెద్దలతోను, రాష్ట్ర ప్రభుత్వాలతోను చర్చలు జరపడానికి కేంద్ర ఆహార మంత్రి శ్రీ అజిత్ ప్రసాద్ జైన్ త్వరలోనే ఒక పర్యటనం పెట్టుకుంటున్నారు.

ఈ పర్యటనంలో ఆయన దేశం అంతా తిరుగుతారు. ఎరువుల వాడకం, ఎరువుచేత, మొదలైన అన్ని విషయాలను గూర్చి ఆయన ఈఅందరితోను ఆలోచిస్తారు.

జులై 1, 2 లలో భోపాలులో శ్రీ జైన్ వుంటారు. హైదరాబాదుకు జులై 3 న చేరుకుంటారు. జులై 6 కు లక్నో వెడతారు. అక్కడ 7 దాకా వుంటారు. జులై 8 తిరిగి ఢిల్లీ చేరుకుంటారు.

### ఒరిస్సాలో ధాన్య సేకరణం

శ్రీ జైన్ ఈమధ్యనే ఒరిస్సా వెళ్ళి వచ్చారు. ఈ వెళ్ళివచ్చిన దగ్గరనుంచీ అక్కడ కేంద్ర ప్రభుత్వంచేత, ఆ క్కడి మిగులు ధాన్యం సేకరణ జోరుగా సాగుతోంది. 3 లక్షల మణుగులబియ్యం అక్కడివారు అమ్మకానికి పెట్టారు. ఇంకా బియ్యం, అమ్మడానికి వున్నాయని ప్రభుత్వానికి తెలియజేశారు.

### 80 వేల టన్నులు

ప్రభుత్వం ఇట్లా మొత్తం 60 వేల టన్నుల బియ్యాన్ని సేకరించడానికి నిశ్చయించుకుంది. ఈ సేకరించిన దానిలో అధికభాగం ధాన్యాన్ని, పశ్చిమ బెంగాలుకు పంపిస్తుంది.

### జూలై 3 న హైద్రాబాదులో చర్చలు

జూలై 3 న హైదరాబాదుకు వచ్చినప్పుడు, శ్రీ జైన్, ఆంధ్ర,మద్రాసు, మైసూరు, కేరళ, రాష్ట్రాల ఆహార మంత్రులతో, ఆ యా రాష్ట్రాలలోని ఆహారపరిస్థితులను గూర్చి చర్చిస్తారు. అప్పుడే దక్షిణాది ఆహారమండల నిర్మాణాన్నిగూర్చిగూడా చర్చలు జరుగుతాయి.

దేశంలో తన ధాన్యం ఎగుమతులను ఒక మండలం మేరకు నియమించడం అన్న భావం ఆంధ్రప్రభుత్వానికి నచ్చుతున్నట్లు కన్పించడం లేదు. దేశంలో అన్నిరాష్ట్రాలకు బియ్యాన్ని అమ్మే మిగులుబొట్లు తనకు వుండాలని ఆంధ్ర ప్రభుత్వం కోరుతోంది.

# వాడకాన్నిబట్టి కేంద్ర విక్రయం పన్ను ఆదాయం పంపిణీ
## సూత్రప్రాయంగా కేంద్రప్రభుత్వ ఆమోదం

మదరాసు, జూన్ 29: వాడకాన్ని బట్టి, కేంద్ర విక్రయం పన్ను ద్వారా వచ్చే ఆదాయాన్ని వివిధ రాష్ట్రాలకు పంచటానికి కేంద్ర ప్రభుత్వం సూత్రప్రాయంగా అంగీకరించినట్లు తెలుస్తోంది.

భారత వాణిజ్యమండలి అధ్యక్షుడు శ్రీ బాబూభాయి ఛినాయ్ ఇక్కడ ఒకచోట మాట్లాడుతూ వాడకాన్ని బట్టి ఆదాయాన్ని వివిధ రాష్ట్రాలకు పంచే పద్ధతిలో చక్కెర, పొగాకు మొదలయిన వానిపై కేంద్రం విక్రయం పన్ను విధించటానికి తమకు ఆక్షేపణ లేదని చెప్పారు.

శ్రీ ఛినాయ్ నిన్న సాయంత్రం ఆంధ్ర వాణిజ్యమండలిలో సభ్యులను కలుసుకున్నారు. శ్రీ ఛినాయ్‌కి ఆంధ్ర వాణిజ్యమండలి అధ్యక్షుడు శ్రీ వి. వేణుగోపాల్ స్వాగతం ఇచ్చారు.

కేంద్ర ప్రభుత్వం విధించిన పన్నుల వలన పరిశ్రమల అభివృద్ధి అణిగిపోయి ఉత్పత్తి తగ్గిపోతుంది. కేంద్ర విక్రయ సుంకం విధింపును జూలై 1 నుండి కనీసం రాష్ట్రాలలోని చట్టాలు మారేవరకు వాయిదా వేయాలని" శ్రీ వేణుగోపాల్ చెప్పారు.

సన్మానానికి కృతజ్ఞత తెలిపి శ్రీ ఛినాయ్ ఇలా చెప్పారు: "వర్తకులు దేశంయొక్క అభివృద్ధిని మనస్సులో వుంచుకొని వ్యవహరించాలి. అప్పుడు చాలా చిక్కులు తగ్గిపోతాయి. కేంద్ర ప్రభుత్వం విధించిన పన్ను వలన వర్తక లోకంలో కొంత అలజడికలిగినమాట నిజం. మీ సమాఖ్య ఈ విషయంలో సమగ్రంగా, నిష్కర్షగా చెప్పవలసిన వారందరికీ చెప్పింది. ఆందోళన, అల్లరి వలన పనులు కావు అని నమ్మేవాళ్ళలో నేను ఒకడిని. ఆందోళనవలన ఆశించిన ఫలితంరాదు. భారతప్రభుత్వానికి మన ఇబ్బందులను తెలియజేసి నచ్చచెప్పాలి. నేను స్వయంగా ఆర్థికమంత్రితో మాట్లాడాను. మరికొంత పారిశ్రామికులుగూడా వారిని కలుసుకున్నారు. ఆయన ఎక్కువ సందుఇవ్వకపోయినా అదనపు లాభాలపన్ను, రిజర్వు డిపాజిట్ స్కీము తాత్కాలికం అని అర్థం వచ్చేటట్లు చెప్పారు. ఏమౌతుందో చూద్దాం. విదేశీవినిమయం ఇబ్బందులను తగ్గించటానికివిలాసవస్తువులదిగుమతులను పూర్తిగా ఆపివేయటానికి అంగీకరించాము. దిగుమతులు ఆపుచేసిన వస్తువుల ధరలు పెరగకుండా చూస్తామని మీ తరఫున మంత్రికి హామీఇచ్చాను. ఆమాటనునిలబెట్టాలి. విదేశీ వినిమయం దుర్వినియోగం కాలేదు కాని మరికొన్ని సంవత్సరాల తరువాత రావలసిన ఇబ్బంది ఇప్పుడే వచ్చింది. పరిశ్రమలకు కావలసిన ముడి వస్తువుల దిగుమతిని నిషేధించకూడదు. ముడిపదార్థాలు లేకపోతే ఉత్పత్తి తగ్గుతుంది, ఉత్పత్తి తగ్గితే ధరలు పెరుగుతాయి. తత్ఫలితంగా ద్రవ్యోల్బణం లేదా సుబంధమైన అవస్థలు అనేకం వస్తాయి. విక్రయంపన్ను విషయం నా మనస్సులో వుంది. ఆందోళన కూడదని మీకు చెప్పినా ఇది నన్ను ఆందోళన పరుస్తూ వుంది. రాజీ మార్గంగా వాడకాన్నిబట్టి ఆదాయాన్ని పంచితే కేంద్రవిక్రయం పన్నుకు అంగీకరించవచ్చని అనుకున్నాం. ఈ విషయాన్ని కేంద్రంకూడా స్థూలంగా అంగీకరించినట్లు తెలుస్తుంది" ఇక ప్రభుత్వ వాణిజ్య సంస్థవుంది. ఈ విషయంలో మామూలు వర్తకులకు సాధ్యం కాని వస్తువుల వ్యాపారాన్ని మాత్రమే ప్రభుత్వం చేయాలని నా అభిప్రాయం." ఉపాధ్యక్షుడు శ్రీ ఎం.వెరుమాళ్ శెట్టి వందనము లర్పించారు.

---

## పాకిస్తాన్‌లోని భారతీయులు
### నివాస అనుమతిపత్రాలు తీసికోవాలని నిర్బంధం

కరాచీ, జూన్ 29: పాకిస్తాన్‌లోని భారతీయులు నివాస అనుమతి పత్రాలను నిర్బంధంగా తీసికోవాలని పాకిస్తాన్ ప్రభుత్వం ప్రకటించింది. ఇక్కడి భారతీయులకు కామన్వెల్తు పౌరులకుగల హక్కులను రద్దుచేస్తూ, ప్రభుత్వం అసాధారణ గెజెట్ లో పైప్రకటన చేసింది.

విదేశీయుడనే పదం అర్థాన్ని సవరిస్తూ పాకిస్తాన్ అధ్యక్షుడు చేసిన ఆర్డినెన్సుకు అనుగుణంగా ఈ ప్రకటన చేశారు. పాకిస్తాన్ పౌరుడు కానివారు విదేశీయులే అని ఈ సవరణలో పేర్కొన్నారు.

భారతదేశంలోని దక్షిణాఫ్రికా పాకిస్తాన్ పౌరులకు కామన్వెల్తు పౌర హక్కులను రద్దుచేస్తూ, భారత ప్రభుత్వం విధించిన నిర్బంధాలవల్లనే పాకిస్తాన్ ప్రభుత్వం ఈమార్పు చేసిందని ప్రభుత్వ ప్రతినిధి వివరించారు. 1952 చట్టం ప్రకారం పాకిస్తాన్‌లోని భారతీయులు ప్రస్తుతం నమోదు చేయించుకుంటున్నారు. ఈవిధానమే ఇకముందు కొనసాగుతుంది. విదేశీయుల చట్టాన్ని అనుసరించి భారతీయులు నివాస అనుమతి పత్రాలను తీసికోవాలనే నిబంధనలను అదనంగా చేర్చారు. భారతదేశంలో ఉండే పాకిస్తాన్ పౌరులకు వర్తింపచేస్తున్న అనుమతి సూత్రాలనే పాకిస్తాన్ ప్రభుత్వం కూడా అనుసరిస్తుందన్నారు.

## గుమ్ములూరు హత్యా నేరం
### 16 గురి అరెస్టు

భీమవరం, జూన్ 28: భీమవరం తాలూకా గుమ్ములూరులో మే 28 వ తేదీన బొమ్మిడి సత్యంను, అల్లాడి వెంకటాచలంను హత్యచేశారనే ఆరోపణపై 16 గుర్ని ఆకివీడు పోలీసు ఇన్‌స్పెక్టరు శ్రీ వి. అప్పారావు అరెస్టుచేశారు. అరెస్టయిన వారందరూ గుమ్ములూరు శివారు అప్పారావుపేట గ్రామస్థులు. ముద్దాయిలను జామీనుపై విడుదలచేయవలసినదిగా స్థానిక మేజస్ట్రేట్ కోర్టులో శ్రీ జి. జగన్నాథరాజు దరఖాస్తు పెట్టారు.

## రంగా కాంస్యవిగ్రహం
### జూలై 12 న విజయవాడలో ప్రతిష్ఠాపన

విజయవాడ, జూన్ 28: రంగా కాంస్య విగ్రహాన్ని జూలై 12 న విజయవాడ రైలుస్టేషను సమీపంలో ప్రతిష్ఠాపన చేస్తారు. విగ్రహాన్ని కేంద్ర ప్రభుత్వ నీటిపారుదల విద్యుచ్ఛక్తిశాఖ మంత్రి శ్రీ ఎస్. కె. పాటిల్ ఆవిష్కరిస్తారు. సభకు అంతర్జాతీయ కర్షక సమితి ప్రధాన కార్యదర్శి డాక్టరు డిమిట్రోవ్ అధ్యక్షత వహిస్తారని ఆహ్వాన సంఘాధ్యక్షుడు శ్రీ ఎస్. వి. నాయుడు వ్రాస్తున్నారు.

### హరిజనులకు ఇళ్ళస్థలాలు

తాడేపల్లిగూడెం, జూన్ 28:— తాడేపల్లిగూడెం తాలూకా వల్లూరిపల్లి అగ్రహారంలో 80 హరిజన కుటుంబాలకు 7 ఎకరాల 60 సెంట్ల భూమిని నివేశన స్థలాలుగా తహసిల్దారు శ్రీలంక అగ్నిహోత్రుడు పంచిపెట్టారు.

### ముస్తాబాదలో గ్రామ నాయక శిబిరం

గన్నవరం, జూన్ 26: జాతీయ విస్తరణ కేంద్రోద్యోగుల ఆధ్వర్యాన యీ నెల 16 వ తేదీనుంచీ 19 వ తేదీవరకు ముస్తాబాదులో నిర్వహించిన గ్రామ నాయక శిక్షణ శిబిరానికి "వారిలోకం" పత్రిక సంపాదకురాలు శ్రీమతి కె. రంగమ్మారెడ్డి ప్రారంభోత్సవం జరిపారు. నాటి సభకు శ్రీ పెండ్యాల వెంకటేశ్వరరావు అధ్యక్షత వహించారు. శిబిర నిర్వహణ కాలంలో శిక్షితులు శ్రమదానం చేసి హరిజనవాడలో 1 ఫర్లాంగు మేర మట్టిరోడ్డు వేశారు. జిల్లాలోని వివిధశాఖల అధికారులు శిబిరాన్ని సందర్శించి పలు విషయాలను బోధించారు. వ్యవసాయం, ఆరోగ్యం, సాంఘికవిద్య చేతి పరిశ్రమలు మొదలైన విషయాలను తెలిపే వస్తుప్రదర్శనలను శిబిరంలో ఏర్పాటుచేశారు.

చివరిరోజున బోర్డు ఉన్నత పాఠశాల ప్రధానోపాధ్యాయుడు శ్రీ బి. సూర్యనారాయణ శిక్షితులకు వీడ్కోలు సందేశం ఇచ్చారు. తదుపరి యోగ్యతా పత్రాలను బహూకరించారు.

శిబిరంలో 44 మందికి శిక్షణ లభించింది.

### చీరాల గృహనిర్మాణ సహకారసంఘం

చీరాల, జూన్ 27: చీరాల గృహనిర్మాణ సహకార సంఘం ఇళ్ళు కట్టించేందుకు స్థలాలను సేకరించకుండా ఇచ్చిన తాత్కాలిక ఉత్తరువును ప్రభుత్వం రద్దుచేసింది. స్థలాల యజమానుల ఆక్షేపణపై ఈసహకార సంఘం వాటిని సేకరించేందుకు వీలులేకుండా ప్రభుత్వం లోగడ తాత్కాలిక ఉత్తరువులను జారీచేసింది. ఆ ఉత్తరువులు ఇప్పుడు రద్దయినవి. తక్కువ ఆదాయం వచ్చే ప్రజలకోసం ఈసహకార సంఘం వందఇళ్ళను కట్టించాలని అనుకొంటున్నది.

---

## క్రీడారంగం
### గూడూరు యువజన క్రీడాసంఘ వార్షికోత్సవం

గూడూరు, జూన్ 26: యువజనుల క్రీడా సంఘ 17 వ వార్షికోత్సవం శ్రీ కేతాల లక్ష్మీనరసారెడ్డి అధ్యక్షతన జరిగింది. ఉదయం శ్రీ యస్. రామచంద్రరావు పతాకోత్సవం చేశారు.

వరుసగా మూడు రోజులు ఆటల పోటీలుజరిగాయి. ఫుట్ బాల్ పోటీలో నెల్లూరు ఫ్రండ్స్‌జట్టుపై 3గోలుచేసి వై.యం.సి.ఎ. జట్టుగెలిచింది. బాడ్మింటన్ డబుల్స్‌లో మద్రాసు రెప్ర్యాన్ క్లబ్ జట్టు గూడూరు, నెల్లూరు, జట్లను ఓడించారు. శ్రీ యస్. రామారావు పోటీలు పర్యవేక్షించారు.

సభలో శ్రీ యస్. సుబ్బారెడ్డి ప్రసంగిస్తూ పోటీదారులు ప్రదర్శించిన ప్రతిభను ప్రశంసించారు. అధ్యక్షులు మాట్లాడుతూ గూడూరు యువజనుల కృషిని మెచ్చుకున్నారు. ఒక స్టేడియం నిర్మాణానికి పూనుకోవాలని కోరారు. శ్రీ రామచంద్రరావు ప్రసంగిస్తూ వ్యాయామక్రీడలపట్ల విద్యార్థుల ఆసక్తి పెంపొందించాలని సూచించారు. శ్రీ వెంకటప్ప బహుమతులు పంచారు.

గోవిందరాజులు స్మారక రోలింగు కప్పును గూడూరు వై. యం. సి. ఎ. జట్టుకు ఇచ్చారు.

శ్రీ జార్జి రోజ్ బృందం గానకచేరి జరిగింది. (స్వ. వి.)

## కాటూరు జాతీయ వికాసకేంద్రం
### జరిగినపని వివరణ

కారికహస్తి, జూన్ 27: కాటూరు జాతీయ వికాసకేంద్రం ప్రాంతంలో కొత్తగా రెండు పాఠశాలలను ఏర్పాటుచేశారు. ఇప్పటికే ఉంటున్న 133 పాఠశాలలను అభివృద్ధి చేశారు. ఇరవై మామూలు పాఠశాలలను ప్రాతిపదిక పాఠశాలలుగా మార్చారని నిన్న జరిగిన ఆ కేంద్రానికి చెందిన ప్రణాళికలూ, అభివృద్ధి సంఘ సమావేశంలో అభివృద్ధిశాఖ ఉద్యోగి వివరించారు.

ఈ సంఘాన్ని 1956 మార్చి 8 వ తేదీన ఏర్పాటుచేశారు. నిన్నటి సమావేశానికి డెప్యూటీ కలెక్టరు మేనేజరు శ్రీ ఎన్. సుదర్శనరావు అధ్యక్షత వహించారు. కోవనూరు బాలానంద సంఘం ప్రతినిధిగా శ్రీ ఎల్లయ్యను ఈ సంఘసభ్యుడుగా చేర్చుకోవాలని నిర్ణయించారు. శ్రీ కె. పట్టాభి రామానాయుడు ఈ సంఘం ఉపాధ్యక్షుడుగా ఎన్నికైనారు.

కేంద్రం ఆధ్వర్యాన జరిగిన పని నివేదికను సంఘం ఆమోదించింది. జాతీయవికాస కేంద్రం ఆధ్వర్యాన రైతులకు 6,914 మణుగుల విత్తనాలను పంచిపెట్టారు.

వ్యవసాయానికి నీళ్ళు అందించే 8 బావులను తవ్వారు. 55 పాత బావులను బాగుచేశారు. 47 చెరువులనుబాగుచేశారు. 2560 ఎకరాలలో అదనంగా వ్యవసాయం జరిగింది. రు 24,800 రైతులకు అప్పుగా ఇచ్చారు. నాలుగు సహకార సంఘాలను ఏర్పాటు చేశారు. ఆ సంఘాల సభ్యులవద్ద రు 35,026 వాటాధనంగా వసూలు చేశారు. వీటి ద్వారా రైతులకు రు 1 లక్షకు పైగా అప్పులుగా ఇచ్చారు. క్రయ విక్రయ సౌకర్యాల సహకార సంఘాన్ని ఏర్పాటు చేశారు. గ్రామీణ బ్యాంకు ఒకదానిని ఏర్పాటు చేశారు.

గ్రామ నాయకుల శిక్షణ శిబిరాలు అయిదింటిని నిర్వహించారు. అభివృద్ధి పనులకు రు 9,997-11-6 రొక్కంగానూ, శ్రమదానం రూపంలో రు 39,011-0-0, భవనాల రూపంలో రు 32,385 విరాళంగా వసూలుచేశారు. వివిధ పథకాల ఖర్చుగా ఈ కేంద్రానికి కేటాయించిన రు 82,700 కుగాను ఇంతవరకు రు 90,674 ఖర్చు చేశారు.

### పెనుకొండతలూకా గ్రామోద్యోగుల వినతి

పెనుకొండ, జూన్ 26: జమాబందికి హాజరుకాని గ్రామోద్యోగులను తాత్కాలికంగా తొలగించవలసిందని జిల్లా కలెక్టరు పంపిన ఉత్తరువులను ఉపసంహరించుకోవాలని తాలూకా గ్రామోద్యోగి సంఘం శ్రీ ఓబులరెడ్డి అధ్యక్షతన సమావేశమై ప్రభుత్వానికి విజ్ఞప్తిచేసింది.

గ్రామోద్యోగుల పరిస్థితులను పరిశీలించటానికి నియమించనున్న సంఘం నివేదిక సమర్పించేలోగా తాత్కాలిక సహాయం చెయ్యాలనికూడా పై సంఘం మనవిచేసింది.

### స్వామి ప్రణవానందజీ ఉపన్యాసాలు

బళ్ళారి, జూన్ 28: దివ్యజ్ఞాన సమాజమందిరంలో గత 15 రోజులుగా బ్రహ్మసూత్రాలపైనా, భగవద్గీతపైనా స్వామి ప్రణవానందజీ ఇస్తున్న ఉపన్యాసాలు 25-వ తేదీతో సమాప్తమయ్యాయి.

చివరిరోజున శ్రీ ఎం. ఎల్. ఎస్. శర్మ అధ్యక్షతన సభజరిగింది. పలువురు ప్రసంగప్రముఖులు వైదిక సంస్కృతిని వివరించి చెప్పటంలో స్వామీజీ ప్రతిభావిశేషాలను కొనియాడారు. (స్వ. వి.)

---

## ఆకాశవాణి

మంగళవారం, జూలై 2

హైదరాబాద్ (411 మీటర్లు)

ఉ॥ 6-50 సుప్రభాత్ 7 తె. వా. 7-15 కర్ణాటక సంగీతం (విజయవాడనుంచి రిలే) 7-45 క. వా. 8 ఆం. వా. 8-15 హిం. వా. 8-30 బాబు ఖాన్ 8-45 ఎం. విద్యాసాగర్.

మ॥ 12-30 మిశ్రమాధురి 12-50 మ. వా. 1 మహిళా సమాజం 1-30 వాద్యగోష్ఠి 1-45 రికార్డు సంగీతం 1-50 తె. వా.

సా॥ 5-30 ఎం. విద్యాసాగర్ 5-45 హిందూస్థానీ సంగీత పాఠం 6 స్థానిక ప్రకటనలు 6-05 ప్రాంతీయ వా. 6-15 గ్రామస్థుల కార్యక్రమం 7 తె. వా. 7-15 గ్రామస్థుల కార్యక్రమం (విజయవాడనుంచి రిలే) 7-30 బ్రిటిష్ మ్యూజియం గ్రంథాలయం (ఉర్దూ ప్రసంగం) 7-45 శ్రోతల ఉత్తరాలకు జవాబులు (హిందీ, ఉర్దూ), 7-50 గీతావళి కె. వరలక్ష్మి, 8 కుమార్ పిస్నే 8-30 ఎస్. రామకృష్ణ అయ్యర్ (గాత్ర సంగీతం), 9 ఆం. వా. 9-15 ఉ. వా. 9-20 ఉర్దూ నాటిక 10 కుమార్ పిస్నే 10-30 ప్రసార సమాప్తి.

విజయవాడ (357-1 మీటర్లు)

ఉ॥ 6-30 శుభోదయం 6-35 ప్రసార విశేషాలు 6-40 భక్తిరంజని 7 తెలుగు వా. 7-15 నాగస్వరం 7-45 సంగీత పాఠాలు 8 ఆం. వా. 8-15 హిం. వా.

మ॥ మహిళా సమాజం (హైదరాబాదునుంచి రిలే) 1-30 గానసుధ 1-40 హిం. వా. 1-50 తెలుగు వా. 2 సితార్ 2-15 సారంగి.

సా॥ 5-30 నాగస్వరం 6 స్థానిక ప్రకటనలు 6-5 ప్రాంతీయ వా. 6-15 గ్రామస్థుల కార్యక్రమం 7 తె. వా. 7-15 గ్రామస్థుల కార్యక్రమం 7-30 గాత్ర సంగీతం చిలకలపూడి వెంకటేశ్వరశర్మ 8-30 ఆంగ్ల కార్యక్రమం 9 ఆం. వా. 9-15 సాహిత్య సందిని (కథానిక) 9-30 ఆకాశవాణి వాద్య బృందం 10 గాత్రసంగీతం పి. సరస్వతీదేవి 10-30 ప్రసార సమాప్తి.

మద్రాస్ (ఎ) (319.1 మీటర్లు)

ఉ॥ 6-50 స్వాగతం, 6-55 కార్యక్రమ వివరణ, 7. ఆకాశవాణి వాద్య బృందం, 7-15 త. వా., 7-30 గాత్ర సంగీతం: ఎస్. అనంతకృష్ణన్.

మ॥ 12-30 గాత్ర సంగీతం: టి. సుభద్ర, 1. మహిళాసమాజం, 1-30 గీతమంజరి, 1-40 హిం. వా., 1-50 గీతమాలిక, 2. త. వా., 2-10 వీణ: ఎస్. కాంతిమతి, 2-20 సారంగి, 2-50 కె. ఎస్. ఉమాబాయి.

సా॥ 5. గీతావళి, 5-30 వయొలిన్, ఎస్. సి. కృష్ణమూర్తి, 6-05 ప్రాంతీయ వార్తలు, 6-15 ఎస్. అనంతకృష్ణన్, 6-45 ఆర్. కల్పకం, 7-15 త. వా., 7-30 సంగీత పత్రిక, 7-45 తిరుచ్చినుంచి, 9. సుగమ్ సంగీత్, 9-15 హిందీపాఠం, 9-30 విజయవాడవలె, 10. భక్తి సంగీతం, 10-30 ప్రసార సమాప్తి.

మద్రాస్ (బి) (211.3, (41.32)

ఉ॥ 6-50 (ఎ) వలె 7-0 తె. వా. 7-15 వినోద కార్యక్రమం 7-30 (ఎ) వలె ఆం. వా.

(211.3, 31.28 మీటర్లు)

మ॥ 12-0 కార్మికుల కార్యక్రమం 12-30 (ఎ) వలె 1-0 గీతమాలిక 1-30 ఆం. వా. 1-40 కదంబం 1-50 తె. వా. 2.0 రికార్డు సంగీతం 2-10 (ఎ) వలె.

(211.3, 49.30 మీటర్లు)

సా॥ 5-0 (ఎ) వలె 5-50 స్థానిక ప్రకటనలు 6-0 ఆం. వా. 6-5 ప్రాంతీయ వా. 6-15 గ్రామస్థుల కార్యక్రమం 7-0 తె. వా. 7-15 గ్రామస్థుల కార్యక్రమం 7-30 తమిళ ప్రసంగం 7-45 (ఎ) వలె 9-0 ఆం. వా. 9-15 తమిళ నాటిక 9-30 సుగమ్ సంగీత్ (తిరుచ్చినుంచి రిలే) 10-0 (ఎ) వలె 10-30 ప్రసార సమాప్తి.

## కత్తిపోటువల్ల స్త్రీ మరణం

నరసరావుపేట, జూన్ 28: చల్లా జోసమ్మ అనే 40 సంవత్సరాల వయస్సు స్త్రీని ఎవరో నిన్న కత్తితో పొడిచారు. చికిత్సకోసం ఆమెను ఆసుపత్రిలో చేర్చారు; మరణవాఙ్మూలమిచ్చి ఆమె మరణించింది.

## ప్రమాదవశాత్తు మరణం

మురకపాలెం గ్రామస్థుడు షేక్ మీరావలీ ఈనెల 20 వ తేదీన బస్సు క్రిందపడి మరణించాడు.

## తాళ్లసింగవరం గ్రంథాలయ భవనం
### డిప్యూటికలెక్టరు ప్రారంభోత్సవం

తాళ్ళసింగవరం, జూన్ 24: నవోదయ గ్రంథాలయం నూతన భవనానికి 22 వ తేదీన భువనగిరి డిప్యూటికలెక్టరు ప్రారంభోత్సవం జరిపారు.

గ్రామపంచాయతీ అధ్యక్షుడు శ్రీ జి. మాణిక్యరావు సభికులను స్వాగతం చెప్పి గ్రామ పునర్నిర్మాణ కార్యక్రమాల ప్రాముఖ్యాన్ని వివరించారు. డిప్యూటికలెక్టరు పంచాయతీల అభివృద్ధికి కొన్ని సూచనలు చేసి, ఈ గ్రామపంచాయతీ నిర్వహిస్తున్న కార్యక్రమాలను ప్రశంసించారు.

పేదలకు అన్నదానంచేశారు.

# కామరాజ్‌నాడార్ ఎన్నిక దావా

## విచారణ ప్రారంభం: జూలై 5 కు వాయిదా

మధుర, జూన్ 28: మదరాసు ముఖ్యమంత్రి శ్రీ కామరాజ్ నాడార్ ఎన్నిక చెల్లిందంటూ వచ్చినదావాలో ఎన్నికల న్యాయస్థానం, శ్రీ సి. కె. సుబ్రహ్మణ్యఅయ్యర్ ఉభయపక్షాల ప్రాథమిక ఆక్షేపణలను విన్నారు. నాడార్ తరఫు న్యాయవాది దావానుస్వీకరించటానికి వీల్లేదని ప్రాథమిక ఆక్షేపణ తెలిపారు.

ముఖ్యమంత్రి ఎన్నికైన సాత్తూరు నియోజకవర్గానికి చెందిన ఒక ఓటరు ఈదావా వేశారు.

ముఖ్యమంత్రి ఎన్నికల్లో తప్పుడు పనులుచేశారనీ, అధికారాన్ని దుర్వినియోగంచేశారని, నిర్ణీత మొత్తంకంటె ఎన్నికను ఎక్కువఖర్చుపెట్టారనీ అర్జీదారుడు ఆరోపించారు.

ఈ కారణాలవల్ల శ్రీ నాడార్ ఎన్నికనురద్దుచేసి శ్రీ జయరామరెడ్డి ఎన్నికయినట్లు ప్రకటించాలని కూడా కోరారు. అర్జీదారుడు శ్రీ నాడార్‌ను మొదటిప్రతివాదిగా, శ్రీ జయరామరెడ్డియార్‌ను రెండవ ప్రతివాదిగా చేర్చారు.

అర్జీ ప్రజా ప్రాతినిధ్యం చట్టం సెక్షనులు 82, 117 లకు అనుగుణంగా లేదని నాడార్ తరఫు న్యాయవాది అడ్వొకేటు జనరలు శ్రీ తిరువెంకటాచారి వాదించి సెక్షన్ 90 (3) క్రింద అర్జీని త్రోసివేయాలన్నారు.

"సెక్షన్ 82 క్రింద వారి ఎన్నికలో పోల్గొన్న అభ్యర్థులందరినీ ప్రతివాదిగా చేర్చవలసి వుంది. ఉపసంహారణలకు వ్యవధి తీరిపోయిన తరువాత ముగ్గురు అభ్యర్థులున్నారు. అందులో ఒకరు సెక్షన్ 55 ననుసరించి పోలింగ్ పది రోజులుండగా ఉపసంహరించుకున్నారు. అయినా వారిని కూడా అభ్యర్థిగా పరిగణించాలి. సెక్షన్ 78, 82ల క్రింద ఉపసంహారించుకున్న వారిని కూడా అభ్యర్థులుగానే ఎంచవలసి వుంది." అని శ్రీ తిరువెంకటాచారి వాదించారు.

అంతకుముందు అర్జీదారుని న్యాయవాది మొదట దాఖలు చేసిన అర్జీని సవరించగోరుతూ మరొక అర్జీ దాఖలుచేశారు. ఈ అర్జీలో జయరామరెడ్డి ఎన్నికైనట్లు ప్రకటించాలని కోరిన రెండవ కోర్కెను తీసివేయాలని వుంది.

సెక్షన్ 82 లో ఉపసంహారించుకున్న అభ్యర్థికి, పోటీచేస్తున్న అభ్యర్థికి తేడా చూపించినందున ఉపసంహరించుకున్న అభ్యర్థిని పోటీచేస్తున్న అభ్యర్థిగా ఎంచనవసరం లేదని వాదించారు.

అంతటితో న్యాయస్థానం కేసు విచారణను జూలై 5 కు వాయిదా వేసింది.

విచారణ ప్రారంభం కాకముందు ఉపసంహారించుకున్న అభ్యర్థి శ్రీ ఎస్. సుందరరాజపిళ్ళై తరఫున తనను కూడా ప్రతివాదిగా చేర్చగోరుతూ ఒక అర్జీ దాఖలయింది.

# భారత ఆర్థిక పారిశ్రామిక విధానం

## 'ప్రపంచ ప్రయోగాల నిగ్గు' మనూభాయ్‌షా ప్రకటన

బొంబాయి, జూన్ 28: ప్రపంచంలోని వివిధ ప్రాంతాల్లో, ఆర్థిక, పారిశ్రామిక రంగాల్లో జరుగుతున్న ప్రయోగాలను జాగ్రత్తగా పరిశీలించగా, తేలిన సారాంశమే భారత ఆర్థిక, పారిశ్రామిక విధానమంటూ, భారీ పరిశ్రమలమంత్రి శ్రీ మనూభాయ్ యమ్. షా, భారతప్రభుత్వం అనుసరిస్తున్న పారిశ్రామికీకరణ విధానాన్ని సమర్థించారు. స్వాతంత్ర్యం సాధించిన లగాయతు ప్రభుత్వం యిదేవిధానాన్ని అనుసరిస్తున్నదని మంత్రి అన్నారు.

ఇక్కడ ఒక అభ్యుదయ సంఘ సమావేశంలో ప్రసంగిస్తూ శ్రీ షా యింకా యీవిధంగా తెలియజేశారు. 'భారతదేశం, అటు కార్మిక నియంతృత్వాన్ని గానీ, యిటు పెట్టుబడిదారీ విధానాన్ని గాని అవలంబించక తనకు అనుగుణమైన ఒక విశిష్ట విధానాన్ని అనుసరిస్తున్నది.

ఈ విధానంవల్ల యిదివరకే ఎన్నో సత్ఫలితాలు చేకూరాయి. పరిశ్రమల వ్యాప్తి, ఉత్పత్తి విషయాల్లో, మరే ఆసియాదేశం కూడా భారతదేశంలో జరిగిన అభివృద్ధిని సాధించలేదు.

ఈ విధానం మూలంగా లభ్యమైన ఫలితాలనుబట్టి దీనిమంచి, చెడుగులను నిర్ణయించాలి. ఈ ఫలితాలను సరిగా పరిశీలించనందువల్ల, సమాచారంగా అందకపోవటం మూలంగా ప్రభుత్వ విధానాన్ని విమర్శించటం జరుగుతున్నది.

### విదేశీద్రవ్యానికి ఏర్పాట్లు

ప్రణాళికలో నిర్ణయించిన లక్ష్యాల విషయంలో మనము భయపడవలసిన అవసరంలేదు. ధనసేకరణకు, విదేశీ ద్రవ్యానికి ఏర్పాట్లు జరుగుతున్నాయి. నిర్ణీత లక్ష్యాలు సిద్ధించటంలో ముఖ్యంగా సత్వర పారిశ్రామికీకరణ లక్ష్యాల విషయంలో నాకెలాంటి సందేహము లేదు.

భారీ పరిశ్రమల ప్రణాళిక పరిసమాప్తమైతే ప్రాతిస్విక పరిశ్రమలు అభివృద్ధి పొందటంతోబాటు వీటి ఉత్పత్తి మూడురెట్లు అధికం అవుతుంది.

# వీరూ, పొగాకు

కొత్తగా విధించిన సుంకములు | కొన్ని రకములు

సాధారణంగా హుక్కాకు, తాంబూలముకు, చిలుముకు, నశ్యానికి ఉపయోగించే పొగాకు రకాలకు ధరలు పౌనుకు 50న.పై.లు చెల్లించవలసివుంటుంది. అంతేకాని వాటికి పౌ.కు రు. 1/- హెచ్చు సుంకం రేటు చెల్లించనవసరంలేదు. ఎందుకన, దిగువ రకాల పొగాకుకు, తక్కువరేటు విలువలు కట్టబడ్డవి.

(1) మొత్తం ఆకు అంతా క్యూర్ చేయబడిన నాన్-ఫ్లూ క్యూర్డ్ పొగాకు, కట్టలలో ప్యాకింగుచేయబడినది, లేదా కట్ట కట్టబడినది, క్యూరింగ్ చేసేప్పుడు మధ్య ఈనెలో లావుభాగం తీసివేయబడి, మిగతా ఆకు అంతా చెక్కు చెదరకుండా వుండే రకాలుకూడా దీనిలో చేరతవి.

(2) నాన్-ఫ్లూక్యూరింగ్ చేయబడిన విడిఆకులు మొత్తం ఆకు అంతా క్యూరింగ్ చేయబడినప్పుడు, ముదతలు కనబడుచు ఉండేరకాలు.

(3) నాన్-ఫ్లూక్యూరింగ్ చేయబడిన పొగాకు ముంపులు. మొత్తం ఆకు అంతా క్యూరింగ్ చేసేప్పుడు, పనిచేసేప్పుడు విధివశాత్తు ముంపులుగా విరిగిపోయినవి-అసెస్‌మెంటుకు, మునగనిపొగాకుతో కలిపి చూపబడే రకాలు.

(4) ఫ్లూ క్యూరింగ్ చేయబడినట్టి కానీ, నాన్-ఫ్లూ క్యూరింగ్ చేయబడినట్టి కానీ, కొన్ని యితర గ్రేడుల పొగాకు, అనగా "డస్ట్" "రావా" మొదలైనవి సైజులో 1/16 చ. అం. కంటె మించనివి, విశిష్టమైన సైజులలోనున్న "యూనెలు"

## ప్రాసెసర్లకు సౌకర్యములు

హెచ్చు రేటు విధింపబడదగిన పొగాకును వేర్ హౌసులలో చిన్న ముంపులుగా కానీ డస్టుగా కానీ మార్చి పౌ.కు 50 న.పై. వంతున తక్కువరేటు అసెస్‌మెంటును కోరడానికి వర్తకులకు అనుమతి యివ్వబడింది.

## న్యాయమైన రేటు చెల్లించండి అది మీకున్ను మరియు దేశానికి కూడా లాభకరము.

కేంద్ర రెవిన్యూ బోర్డువారు జారీ చేసినది.

DA-57/73

# నకిలీ కవర్లు, స్టాంపుల ముద్రణ

## కలకత్తా పోలీసులచే పరికరాల స్వాధీనం

కలకత్తా, జూన్ 28: నకిలీ కవర్లను, స్టాంపులను ముద్రించే ఒక యంత్రాన్ని తదితర పరికరాలను పోలీసులు స్వాధీనపరుచుకున్నారు. వెయ్యి రూపాయలపై చిలుకు విలువగల నకిలీ కవర్లు, స్టాంపులు కూడా దొరికాయి.

మైసూరుకు చెందిన యిద్దరు వ్యక్తులను, యీ నకిలీ సరుకును అమ్ముతున్న మరో వ్యక్తిని పోలీసులు అరెస్టు చేశారు. ఇవి ముద్రణ జరుగుతున్న చోట వీరు బస చేస్తున్నారట.

# స్టేట్ బ్యాంకు పాలకమండలి

కలకత్తా, జూన్ 28: పునర్నిర్మాణం అయిన స్టేట్ బ్యాంకు పాలకమండలి జూలై 1 వ తేదీ నుంచి పనిచేస్తుంది. 20 మంది సభ్యులుగల యీ మండలికి శ్రీ పి. సి. భట్టాచార్య అధ్యక్షులుగాను, శ్రీ యస్. వి. గాడ్గిల్ ఉపాధ్యక్షులుగాను ఉంటారు.

శ్రీయుతులు వి. పి. పటేల్, టి. యస్. రాఘవాచారి మేనేజింగ్ డైరక్టర్లుగా పనిచేస్తారు.

వాటాదార్లు ఆరుగురు డైరక్టర్లను ఎన్నుకున్నారు. వీరు: శ్రీయుతులు జె. డి. చోక్సీ, ప్రతాప్‌సింగ్ మధురాస్, డి. పి. గోయెంకా, ఓ. టి. జెంకిన్స్, కె. రామున్నిమీనన్, మద్ది సుదర్శనం.

రిజర్వుబ్యాంకు సలహాపై ప్రాంతీయ ఆర్థిక ప్రయోజనాలకు ప్రాతినిధ్యం యిచ్చేందుకుగాను కేంద్రప్రభుత్వం, ఎనిమిది మందిని డైరక్టర్లుగా నియమించింది. వీరు: శ్రీయుతులు హెచ్. యమ్. పామంద్రశేఖ్రూ, రాంనాథ్ ఏ. పోద్దార్, ఆచార్య డి. ఆర్. గాడ్గిల్, సచీంద్రచౌధురి, డాక్టర్ త్రిగుణసేన్, సత్యపాల్ వీర్మణి, జి. యల్. బన్సాల్, వి. యస్. త్యాగరాజ ముదలియార్. కేంద్రప్రభుత్వం శ్రీ హెచ్. యమ్. పటేల్‌ను, రిజర్వు బ్యాంకు శ్రీ బుర్రా వెంకటప్పయ్యను డైరక్టర్లుగా నియమించారు.

బొంబాయి, కలకత్తా, మద్రాసు ప్రాంతీయ మండలులలో యీ క్రింది వారుంటారు.

బొంబాయి శ్రీయుతులు జె. డి. చోక్సీ, ప్రతాప్‌సింగ్ మధురాస్, హెచ్. యమ్. పామంద్రశేఖ్రూ రాంనాథ్ ఏ. పోద్దార్ ఆచార్య డి. ఆర్. గాడ్గిల్, ఆచార్య డి. జి. కార్వే, యస్. యల్. కిర్లొస్కర్, పురుషోత్తం కంజీ.

కలకత్తా: శ్రీయుతులు డి. పి. గోయెంకా, ఓ. టి. జెంకిన్స్, సచీంద్ర చౌధురి, డా॥ త్రిగుణసేన్, సత్యపాల్ వీర్మణి, జి. యల్. బన్సాల్, ధీరేంద్రనాథ్ మైత్రా, ధీరేంద్రనాథ్ సేట్, కె. యస్. బిర్లా, సురేశ్ చంద్రరాయ్.

మద్రాసు: శ్రీయుతులు కె. రామున్నిమీనన్, మద్ది సుదర్శనం, వి. యస్. త్యాగరాజముదలియార్, కస్తూరి శ్రీనివాసన్, ఆర్. ఇ. కాస్టెల్, యమ్. ఏ. చిదంబరం చెట్టియార్, టి. యమ్. చిన్నయ్యపిళ్ళై.

స్టేట్ బ్యాంకు అధ్యక్షుడు అధికారరీత్యా, ప్రాంతీయ మండలుల సభ్యుడుగా ఉంటారు.

# వాషింగ్టన్‌లో ఇస్లాంకేంద్రం

వాషింగ్టన్, జూన్ 28: వాషింగ్టన్‌లోని రాయబార కార్యాలయాల సమీపంలో పన్నెండున్నర లక్షల డాలర్ల ఖర్చుతో నిర్మించిన ఇస్లాం కేంద్రానికి ఇవాళ అమెరికా అధ్యక్షుడు శ్రీ ఐసెన్‌హోవర్ ప్రారంభోత్సవం జరిపారు.

శ్రీ ఐసెన్‌హోవర్ సతీ సమేతంగా, పాదరక్షలు తీసి వేసి నూతనభవనం ప్రవేశించారు.

ఉత్సవానికి అమెరికా కెనడాలలో అన్ని ప్రాంతాలనుంచీ సుమారు 80 వేల మంది ముస్లింలు వచ్చారు.

ఇస్లాం కేంద్రభవనాన్ని నిర్మించటానికి ఏడేళ్లు పట్టింది. 15 ముస్లిం రాజ్యాలనుంచి ఈ భవన నిర్మాణానికి విరాళాలు వచ్చాయి.

ఈ కేంద్రంలో ఒక మసీదు, గ్రంథాలయం, వస్తు ప్రదర్శశాల, ఉపన్యాస మందిరం ఉన్నాయి.

# బొంబయిలో తుఫాను

బొంబాయి, జూన్ 28: బొంబాయి నగరంలో గురువారం రాత్రి గంటకు 48 మైళ్ళవేగంతో పెనుగాలి చాలా తీవ్రంగా వీచింది. తుఫాను పరిస్థితి సముద్రం తీరాన కచ్ మాండ్వినుంచి వెంగుర్లావరకు వ్యాపిస్తో పాడుగునా ఉన్నట్లు నావలను హెచ్చరిస్తూ అధికారులు రేవులవద్ద సూచించారు.

ఈ ఉదయ 8-30 గంటలకు పూర్వం 24 గంటలలో బొంబాయి నగరంలో విశేషంగా వర్షించినది. కోలాబాలో 9 సెంటిమీటర్లు వానకురిసింది. బొంబాయి సమీపంలో కొండప్రదేశాలైన రైలుమార్గంలో ఖిర్గాన్‌వద్ద అత్యధికముగా 23 లో నవ్వాలో 19, వాగ్‌గాన్‌లో 10 సెంటీమీటర్లు వర్షించినది.

ఆడపాదపా విశేషంగా వర్షించినందువల్ల బొంబాయి పొరుగుప్రాంతాల రైళ్ళ రాకపోకలకు కొంత అంతరాయం కలిగి. బండ్లు ఆలస్యంగా నడిచాయి. సరాసరిగా వెళ్లే రైళ్లు మామూలుగా నడిచాయి. ఈ అసాధారణ వాతావరణ పరిస్థితివల్ల విమాన రాకపోకలు తారుమారు కాలేదు అని ఒక రైల్వే ఉద్యోగి చెప్పాడు.

# భారత రైల్వేల అభివృద్ధి విస్తరణ

## 45లక్షల డాలర్ల సహాయం

న్యూఢిల్లీ, జూన్ 28: భారతీయ రైల్వేల అభివృద్ధి, విస్తరణ, కార్యక్రమాలకు సుమారు 26470 టన్నుల ఉక్కును కొనుగోలు చేసే నిమిత్తం 45 లక్షల డాలర్ల అభివృద్ధి సహాయ నిధులను అమెరికా అంతర్జాతీయ సహకార పాలకవర్గం భారత దేశానికిస్తుంది. ఉభయదేశాల ప్రతినిధుల మధ్య నేడు జరిగిన ఒప్పందం ప్రకారం యీ సహాయం జరుగుతుంది.

భారత ప్రభుత్వం తరఫున ఆర్థిక శాఖ సంయుక్త కార్యదర్శి శ్రీ యస్. సి. సేన్ గుప్త, అమెరికా తరఫున సాంకేతిక సహకార పాలకవర్గ డైరక్టరు శ్రీ హారీ ఎ. హిండరర్ సంతకాలు చేశారు.

# చైనాలో కమ్యూనిజం

## పాశ్చాత్య సైనిక జోక్యం వల్లనే వచ్చింది

న్యూఢిల్లీ, జూన్ 28: పాశ్చాత్య రాజ్యాల సైన్యాలు జోక్యం చేసుకొని ఉండకపోతే చైనాలో కమ్యూనిజం వచ్చేదేకాదు, అని "కెనడా దూరప్రాచ్యవార్తాలేఖ" అనే పత్రిక సంపాదకులు రెవరెండ్ జేమ్స్ జి.ఎండికాట్, ప్రపంచ వ్యవహార భారతమండలిలో ఉపన్యసిస్తూ అన్నారు.

చైనా కమ్యూనిస్టు ప్రభుత్వాన్ని అమెరికా గుర్తించకపోవడమే నేటి ప్రచ్ఛన్న సంఘర్షణకీ, ఆయుధ నిర్మాణపు పోటీకీ, మూలం అని వీరన్నారు. ఎలాగైనా చైనాలో కమ్యూనిస్టుప్రభుత్వాన్ని సైనిక బలప్రయోగంవల్ల పడగొట్టే పరిస్థితులు సృష్టించాలని అమెరికా ప్రయత్నిస్తోంది.

అణ్వస్త్రాలను నిషేధించాలంటూ, నెవాడా పరీక్షలవల్ల స్ట్రాంటియం-90 దోషంవల్ల కెనడాలో కొందరు మృతి చెందారని చెప్పారు.

# ఆయుర్వేదయునానీ విధానాలు

## ఆరోగ్య మంత్రులకు వినతి

న్యూఢిల్లి, జూన్ 28: ఒక జాతీయ ఆరోగ్య విధానాన్ని రూపొందించి ఆయుర్వేద, యునానీ, వైద్య విధానాలకు గౌరవనీయమైన స్థానాన్ని ఇవ్వాలని కేంద్రరాష్ట్ర ఆరోగ్య మంత్రులకు ఒక వినతి పత్రాన్ని శ్రీ రాం నారాయణ వైద్య సమర్పించారు.

ఈయన 'సచిత్ర ఆయుర్వేద' పత్రికా సంస్థ నిర్వాహకులు. ఆరోగ్య మంత్రుల సమావేశం రేపుజరుగబోతున్నది.

నూరింట 85 వంతుల మంది ఆరోగ్యం కాపాడే ఆయుర్వేదానికి స్థానమిచ్చి దేశీయ వైద్యవిధానాలకు ప్రోత్సహించాలని వీరు కోరారు. దీనివలన విదేశీయులకు మన ద్రవ్యం పోకుండా చేయవచ్చని సూచించారు. ఆయుర్వేద యునానీలు అంతగా తేడాలేవని రెంటినీ కలిపి ఏక విధానం రూపొందించవచ్చని వివరించారు.

# పంచదార ఫ్యాక్టరీ దగ్ధం

## రు 10 లక్షల ఆస్తి ధ్వంసం

శివన్ (బీహారు), జూన్ 28: సర్వాన్ జిల్లాలోని పచ్రుఖీలో ఒక పంచదార ఫ్యాక్టరీలో మంగళవారంనాడు ఘోరమైన అగ్నిప్రమాదం సంభవించి రు 10 లక్షల ఆస్తి ధ్వంసమైనది. దగ్గిరలో వున్న మరో యంత్రాగారానికి మంటలు అందుకోకుండా ప్రజలు దగ్గార్పగలిగారు.

# రావీ నది గమనంలో మార్పు

కరాచీ, జూన్ 28: రావీనది ఎగువ ప్రాంతాలలో గమనం మారి, గురుదాసపూర్ సమీపంలో భారత పాకిస్తాన్ సరిహద్దులలో షకర్గర్ తహసీల్‌లో 80 వేల ఎకరాలనేల కోసుకుపోయింది.

నదీగమనంలో మార్పు ఇలా గే ఇంకా సాగితే షకర్గర్ పట్టణం నదిపాలవుతుంది. ఇప్పటికి ఈపట్టణంలో మొత్తం జనాభా పదివేలలో రెండువేల మంది నిరాశ్రయులైనారు.

ఎగువ ప్రాంతంలో ఈ నదే భారత పాకిస్తాన్‌లకు సరిహద్దు.

నదీ గమనం క్రమక్రమంగా పశ్చిమానికి మారుతున్నది. క్రిందటి మూడేళ్లలో పాకిస్తాన్‌కు చెందిన ప్రాంతాన్ని 8 మైళ్ల మేరకు ఈ నది అప్పుడే కబళించిందట.

# పాక్ గ్రామంలో 14 మంది దారుణ హత్య

కరాచీ, జూన్ 29: పూర్వ సింధు రాష్ట్రంలో సక్కర్‌కు 45 మైళ్లలో ఒక గ్రామంపై క్రిందటి బుధవారమునాడు కొందరు దుండగులు దాడిచేసి, 12 మంది గ్రామస్థులను తుపాకులతో కాల్చి చంపి, ఇద్దరిని నిలువునా మంటలలోపడవేసి చంపారని వార్తవచ్చింది.

సింధురాష్ట్ర ప్రాంతంలో రెండు జాతుల మధ్య కలహాల మూలంగా ఇటువంటి దాడి జరగడం యిటీవల యిది రెండోసారి.

# అటవీ సంపద ప్రాధాన్యంగుర్తించాలి

## భోగభాగ్యాలకు నిధానం

కోయంబత్తూరు, జూన్ 28: అటవీ సంపద పరిరక్షణ, అభివృద్ధి, వినియోగాల ప్రాధాన్యాన్ని ప్రజలు గుర్తించినప్పుడే, రెండవ ప్రణాళికలోని రు 27 కోట్ల అటవీ పథకాలను జయప్రదంగా అమలు జరపటానికి సాధ్యం అవుతుందని దాక్షిణాత్య అటవీశాఖ రేంజర్ల కళాశాలలో స్నాతకోపన్యాసం చేస్తూ కేరళ గవర్నరు డాక్టరు బూర్గుల రామకృష్ణరావు తెలియచేశారు.

విజ్ఞానాభివృద్ధితోబాటు, మృగ, వృక్ష నికేతనాలనుగూడా మానవుడు ఆక్రమిస్తూ వచ్చాడు. అడవులు భోగభాగ్యాల నిధానమన్న అంశం అతనికి స్ఫురణకు రావటంలేదు. సింహం, ఖడ్గమృగంలాంటి అపురూప మృగసంతతి, ఒక్క ఆఫ్రికాలో తప్ప మరే దేశంలో గూడా యిప్పుడు కనిపించటంలేదు. మనది వ్యవసాయ ప్రధానదేశం కావటంవల్ల, యిక్కడి, అడవులు, జంతువులు గూడా మనకు పెన్నిధానం లాంటివి. ఇవిమన జాతీయ జీవితంలో గూడ పెనవేసుకొనిపోయాయి. ఈ అంశాన్ని యికమీదట ఎంతమాత్రం విస్మరించటం తగదు." అని డాక్టర్ రామకృష్ణరావు చెప్పారు.

# రాష్ట్రాల్లో మూలికల కేంద్రాల స్థాపన

అన్ని రాష్ట్రాల్లో నమూనికల కేంద్రాలను స్థాపించి ఓషధులను క్రమపద్ధతిలో పెంచాలన్నారు. వైద్య, ప్రజారోగ్యం, అటవీ శాఖలు యీ విషయంలో సమిష్టిగా కృషిచేయాలని గూడా వీరు సూచించారు.

# అణ్వస్త్రపరీక్షల నిషేధం

## డెన్మార్క్ అభిప్రాయం

కోపెన్‌హాగన్, జూన్ 28: అణ్వస్త్ర పరీక్షలను మానివెయ్యవలసిందే అని డెన్మార్క్ ప్రభుత్వం అభిప్రాయపడుతున్నట్లు విదేశాంగమంత్రి శ్రీ జెన్స్ ఆటోక్రాగ్ పార్లమెంటులో చెప్పారు. సమగ్రమైన నిరాయుధీకరణ ఒప్పందానికి అనిషేధం మొదటిమెట్టు కాగలదన్నారు. అయితే తనిఖీ తగినంత ఏర్పాటుండాలన్నారు.

# యెమెన్ పట్టణంపై బ్రిటిష్ బాంబులు

న్యూయార్కు, జూన్ 28: ఎమెన్ తూర్పుసరిహద్దులో ముకైర్ అనే పట్టణంపై జూన్ 19 న బ్రిటిష్ విమానాలు అయిదుగంటలసేపు బాంబులు ప్రయోగించాయని, యెమెన్‌ప్రభుత్వం ఆరోపించింది.

# 58 లో ఉగాండా శాసన మండలికి ఎన్నికలు

ఎంటెబి, జూన్ 28: ఉగాండా శాసన మండలికి ఆఫ్రికా ప్రతినిధులను ఎన్నుకొనే నిమిత్తం దేశం అంతటా 1958 లో ప్రత్యక్ష ఎన్నికలు జరపాలని ఉగాండా ప్రభుత్వం నిర్ణయించింది. ఈ దేశం బ్రిటిష్ ధర్మకర్తృత్వపాలనలో ఉంది. ఇప్పుడు ఒక్క ఉగాండా రాష్ట్రంలోను, తక్కిన ప్రాంతాలలో 1961 లోను ఎన్నికలు జరపాలని మొదట నిర్ణయించారు.

# అణుశాస్త్ర ప్రదర్శనం

ఆమ్‌స్టర్‌డామ్, జూన్ 29: అంతర్జాతీయ అణుశాస్త్ర ప్రదర్శనం యిక్కడ అధికారరీత్యా నిన్న ప్రారంభం అయింది ఇంతటి బ్రహ్మాండమైన అణుప్రదర్శనం యిదివరలో ఎన్నడూ ఏర్పాటుకాలేదు.

1955 లో జెనీవాలో జరిగిన అణుశాస్త్ర ప్రదర్శనంకంటె యిది ముఖ్యమైనదని చెపుతున్నారు. వైద్య, వ్యవసాయరంగాల్లో అణువిజ్ఞానాన్ని వినియోగించటం యిందులోని ప్రత్యేకత. సెప్టెంబర్ 15 వరకు దీనిని ప్రదర్శిస్తారు.

# జోర్డాన్‌లో అమెరికాకు స్థావరాలు ఇవ్వవచ్చున లేదు

అమ్మాన్, జూన్ 28: జోర్డాన్‌లో మఫ్రాక్, అకాబాల వద్ద పూర్వపు బ్రిటిష్ స్థావరాలను అమెరికాకు అద్దెకు ఇవ్వవచ్చని జోర్డాన్ ప్రభుత్వంలో సౌదీ అరేబియా ఏకాభిప్రాయానికి వచ్చినట్లు, ఈజిప్టు సిరియా పత్రికలు ప్రచారం చేసిన వార్త నిజం కాదని, సౌదీ అరేబియా ప్రభుత్వం ఇవాళ ప్రకటించింది.

# ఈజిప్టుకు పరిహారం సంగతి బ్రిటన్ తేల్చాలి

లండన్, జూన్ 28: నష్టపరిహారం మొదలైన ఆర్థిక విషయాలు పరిష్కారం కానిదే బ్రిటన్‌తో ఈజిప్టు సంబంధాలు తిరిగి యథాస్థితికి రావు, అని నాసర్ సలహాదారు శ్రీ ఆలీ సబ్రీ ఇవాళ కైరో రేడియో ప్రయోగంలో స్పష్ట పరిచారు.

# ఇజ్రేల్ నౌకలను ఈజిప్ట్ అటకాయిస్తుంది

కైరో, జూన్ 29: ఇజ్రేల్ నౌకలు సూయజ్ కాలువలో కాని, అకాబా సింధుశాఖలో కాని ప్రయాణం చెయ్యడానికి వస్తే, ఈజిప్టు అటకాయించి తీరుతుందని, నాసర్ సలహాదారు శ్రీ ఆలీ సబ్రీ, కైరో రేడియో ప్రసంగంలో హెచ్చరించారు.

# సంపాదకునకు లేఖలు

## ఆంధ్రప్రదేశ్ వరిపంటలో మిగులా?

ఆర్యా, భారతదేశంలో ఆహార సమస్య కనిపించగనే అందరి దృష్టి ఆంధ్రప్రదేశ్ పై పడింది. దీనిని ఆహార మండలంగా నిర్ణయించుకొని దానితో కలుపుకుని తమ పని పరిపుచ్చుకోవచ్చునని మైసూరు, మద్రాసు రాష్ట్రాలు ఆలోచిస్తున్నవి. ఈ మండలంలో కేరళను కలుపవలెనని వీరి ఆందోళన.

అసలు ఆంధ్రప్రదేశ్ స్థితివిమిటి? ఈ జూన్ 24 న మద్రాసునుంచి ఆంధ్రప్రదేశ వరిపంట వివరాలిచ్చారు. ఈ అంకెలు యథాతథంగా అంగీకరిస్తే జరిగిన ఐదు సంవత్సరాలలో ఈ సంవత్సరం నూటికి 28 వంతులు ధాన్యం అదనంగా పండిందని క్రిందటి సంవత్సరం కన్నా 17 వంతులు పండిందని, సాగులో నూటికి ఆరువంతులు పెరిగిందని గత 5 సంవత్సరాలలో 18 వంతులు పెరిగిందని వ్రాశారు.

ఈ సంవత్సరం సాగు భూమిలో 18వంతులు, పంటలో 17వంతులు పెరిగిందని సంతోషించ దగిన సంవత్సరం, ధరలు పెరగడం, అందుకు విరుద్ధంగా చౌక దుకాణాలను ప్రారంభించడం వాటికి ధాన్యం లేక కేంద్రం వద్ద బిచ్చమడగడం వారు సాధ్యం కాదనడం అవి మూతపడటం ఆంధ్రులందరికీ అనుభవమే. మరి ధాన్యం లేక రాష్ట్రప్రభుత్వం స్వీకరించ లేకపోయిందంటారా? అది మనది కాదని కేంద్రంమీద నేరం వేయదలంచిందంటారా? ధనిక రైతుల వద్ద నిల్వలు పట్టక పోవటం రిజర్వు బ్యాంకు వీరికి పెట్టుబడులు పెట్టడమే కారణంగా నడిచింది. శ్రీకాకుళం, ఉభయ గోదావరి, కృష్ణా, గుంటూరు, నెల్లూరులలో పరిస్థితి ఏమంతమారలేదు. రాష్ట్రం మిగులు రాష్ట్రం అయితే ఎందుకు ప్రభుత్వం శ్రద్ధ తీసుకోలేదు? తీసుకోమని కేంద్రం కోరలేదు.

ఈ సంవత్సరం అన్ని సంవత్సరాల కన్న నూటికి 28 వంతుల పంట పెరిగింది. ఈ సంవత్సరం పంట తగ్గిపోలేదు. కృష్ణా గుంటూరు జిల్లాలో వర్షాలు పడి వరి ధాన్యం రాలుడు తగ్గింది. మంచి లాభంలేదు. ఈ సంవత్సరపు 23 వంతుల అదనపు ఉత్పత్తివల్లనే ఆంధ్రప్రదేశ్ మిగులు రాష్ట్రం అయిందంటారా?

ఆంధ్రప్రదేశ్‌లో 1949 నుండి ఇంతవరకు ఈ గత సంవత్సరపు అంచనాలు కూడా గమనించి సంవత్సరంవారీ సాగుబడి, రాలుబడి గమనించుదాం.

### వరి ధాన్యం

| సంవత్సరం | వేల యకరాలు | వేల టన్నులు |
|---|---|---|
| 1949-50 | 5821 | 2119 |
| 50-51 | 5458 | 2164 |
| 51-52 | 5612 | 2203 |
| 52-53 | '5143 | 2077 |
| 53-54 | 6372 | 3066 |
| 54-55 | 6361 | 3105 |
| 55-56 | 6376 | 2946 |

ఇది ప్రభుత్వం తమ నివేదికలో ప్రకటించిన వివరాలు: జూన్ 24 మదరాసునుండి వచ్చిన అంకెల వివరాలు యివి.

| | | |
|---|---|---|
| 1955-56 | 6728 | 3046 |
| 56-57 | 7104 | 3300 |

ఈ వివరాలు కొన్ని పత్రికలలో ప్రకటితమయినవి. ఈ లెక్కలపై ఆధారపడే ఆంధ్రప్రదేశ్ మిగులు రాష్ట్రం అని నిర్ణయించి ఈ మిగులు రాష్ట్రాన్ని ఏ మండలంలో కలపాలి అని మీమాంసపడుతున్నట్లు కనుపిస్తున్నది. ఇదికాక వేరే అంకెలు ప్రకటిస్తారా?

ఈ పరిస్థితులలో అన్ని రాష్ట్రాలకూ మార్కెట్టుకు ఆంధ్ర వరి మార్కెట్టు బహిరంగ ఖంత అవడం బాధపడవలసిన సంగతి కాదు. మరి ఆంధ్రుల సంగతి ఏమిటి? ఈ విపరీత ధరల బారినుండి మిగులు జిల్లాలే తట్టుకోలేకపోతుంటే మిగతా జిల్లాల సంగతి ఏమి కాను? ఇప్పటికే లక్షల టన్నుల ధాన్యం ఆంధ్రనుంచి బయటి రాష్ట్రాలకు పోయినవి. ఈ విషయం 8 నెలలనుంచీ నెత్తిన నోరుపెట్టుకొని ఘోషపెడుతున్నాం.

కేంద్రమంత్రి జైన్ ఒకనాడు అంతా మిగులన్నారు. అంతా తరుగుఅన్నారు. వ్యవసాయ మంత్రి ధరలు పెరగడమే మంచిదన్నారు. ముఖ్యమంత్రి ఏమంత ప్రమాదంగా పెరగలేదన్నారు. ధనిక రైతులు మినహా ఇందువల్ల లాభపడిన వారు కనిపించరు. రాష్ట్ర కేంద్ర ప్రభుత్వాలు కూడబలుకుకుని ధనిక రైతుల నిలవలను స్వాధీనపరచుకొని బియ్యానికి మణుగులకు ధర రు 12 వంతున చెల్లించాలి.

రాష్ట్ర ముఖ్యమంత్రి ప్రణాళికల శాఖను తీసుకోవాలి. ఆహార శాఖను దానితోపాటువ్యవసాయ ఉత్పత్తిని ముఖ్యమంత్రి తీసుకొని ప్లానింగులో భాగంగా నోట్ల ముమ్మరం సమస్య పరిష్కారంగా సమన్వయంచేసి నడపాలి. అన్నిచోట్ల చౌక దుకాణాలను ఏర్పాటు చేయడం, కావలసిన నిలవ నుంచటం, ధరలు తగ్గించటం, అయింతర్వాత మిగులు ఉంటే తప్పకుండా ఇతర రాష్ట్రాల కివ్వాల్సిందే కానీ, ఆంధ్రప్రదేశ్ మిగులు రాష్ట్రం అనే నినాదంమాని దేశంమొత్తంఆహార సమన్వయం ఎట్లా జరుగుతుంది? ఈనాడు నూతనంగా నిర్మించిన, నిర్మిస్తున్న ప్రాజెక్టులలో ఎంతపంట పండింది? జాతీయ విస్తరణ కేంద్రాలకింద ఎంత ఉత్పత్తి అయింది? ఋణాలు, సబ్సిడీలవల్ల ఎంతవరకు జరిగింది పరిశీలన చేయాలి. విపరీత ధరల బారినుండి ప్రజలను రక్షించాలి.

వావిలాల గోపాలకృష్ణయ్య, సత్తెనపల్లి.

## సాంకేతిక పరీక్షల ఫలితాలలో జాప్యం

ఆర్యా, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఏటేటా నిర్వహిస్తున్న సాంకేతిక పరీక్షల ఫలితాల ప్రకటనలో జరుగుతున్న జాప్యంవలన విద్యార్థులకు చాలా చిక్కులు వస్తున్నవి ఏప్రిల్ నెలలో జరిగిన సాంకేతిక పరీక్షలలో ఒకభాగం అయిన సివిల్, మెకానికల్, ఎలక్ట్రికల్ మొదలగువాటి ఫలితాలు ఇంతవరకూ ప్రకటితములేదు. ఇప్పుడప్పుడే ప్రకటితమయ్యే అవకాశం కూడా కనబడటంలేదు. ఈ సబ్జక్టులకు కూర్చునే విద్యార్థులసంఖ్య చాలా తక్కువ. వేలకొలదీ సంఖ్యలో ఏటా విశ్వవిద్యాలయం నిర్వహిస్తున్న పరీక్షా ఫలితాల ప్రకటనలోలేని జాప్యం పరిమితమైన సంఖ్యలో పాల్గొనే సాంకేతిక విద్యార్థుల పరీక్షా ఫలితాలు ఇంత ఆలస్యం కావలసినఅవసరం తెలియటంలేదు. ఈ ఫలితాలు తెలిసేవరకూ విద్యార్థుల భవిష్యత్తు ఎటూ తేలకుండా అయోమయంగా వుంటోంది. ఈ ఫలితాలు తేలేవరకూ ఏ సంస్థల్లోనూ ఉద్యోగం లభించే అవకాశంలేదు. లోయర్‌గ్రేడ్ విద్యార్థులు హయ్యర్ గ్రేడ్ కోర్సులో చేరటానికి ఈజాప్యం పెద్ద ప్రతిబంధకంగా ఉంది. కాలం ఈ విధంగా దుర్వినియోగం కావటంలో ఎలాంటి కష్టాలకు విద్యార్థులు లోనవుతారో నేను వేరే చెప్పనవసరంలేదు. పదిమాసాల కోర్సు ఈ జాప్యంవలన ఏ డెనిమిది నెలలలో పూర్తిచేసుకోగలగటం విద్యార్థులకు చాలా ఇబ్బంది కలిగిస్తుంది. దేశాభ్యుదయంలో ప్రభుత్వం నిర్వహిస్తున్న అనేక నిర్మాణాత్మక కార్యక్రమాలకు టెక్నిషియన్ల కొరత ఎక్కువగా వున్నదనే అభిప్రాయం ప్రముఖులు అనేకమంది వ్యక్తం చేస్తున్నారు. ఇలాంటి పరిస్థితుల్లో ఈ జాప్యాన్ని తొలగించి ప్రభుత్వం విద్యార్థులపట్ల కొంత సానుభూతితో ఈ విషయం పరిశీలిస్తుందని ఆశిస్తున్నాను.

ఒక విద్యార్థి.

## బాపట్ల అమ్మకం పన్ను కార్యాలయం

ఆర్యా, పట్టణంలోని అమ్మకం పన్ను వసూలు కార్యాలయంలో టర్నోవర్ ఫారాలు, తదితర నిర్ణీత పత్రాలు అయిపోయినందువల్ల వ్యాపారస్తులకు చాలా ఇబ్బందిగా ఉంది. అందువల్ల ప్రభుత్వం ఈ ఫారాలను కార్యాలయానికి వెంటనే సరఫరాచేసి ఇబ్బందిని తీర్చాలని విజ్ఞప్తి చేస్తున్నాను.

బాపట్ల, ఆలపాటి లక్ష్మీనరసింహసెట్టి.

## నల్లమడ వరద

ఆర్యా, చీరాల - చిలకలూరిపేట రోడ్డుకు పసుమర్రు సమీపంలో నల్లమడ వరదవల్ల గండిపడి రాకపోకలన్నీ బందయినవి. చీరాల - చిలకలూరిపేట బస్సులు గండికి అవతలి వైపునుంచే తిరిగివెళ్తున్నవి. ప్రయాణ సౌకర్యాలకు అవరోధ మేర్పడి ప్రజలు ఇబ్బందిపడుతున్నారు. గండి దగ్గరకు బస్సులకోసం వెళ్ళాలంటే మూడు నాలుగు అదనంగా ఖర్చు చేయవలసి వస్తోంది. ఇక పత్రికల ఏజెంట్ల అవస్థలు చెప్పనలవికాదు. ఇంతకూ ఇది ప్రమాదవశాత్తు సంభవించిన చిక్కు కాదు. కిందటి వర్షాకాలంలో మొట్టమొదట యీ రోడ్డుకు గండి పడింది. వేసవిలోనైనా మరమ్మతు చేయించివుంటే బాగుండేది. గండిపడి ఎనిమిది నెలలయినా అటువంటి ఏర్పాటేమీ జరగలేదు. తాత్కాలికఏర్పాట్ల పేరిట వేలాది రూపాయలు వెచ్చించారు. ప్రయోజనం శూన్యం. త్వరగా ఈ గండిని పూడ్పించి రోడ్డుకు మరమ్మతు చేయించవలసినదిగా ప్రభుత్వానికి విజ్ఞప్తి.

ఉన్నవ రాజేశ్వరరావు, చిలకలూరిపేట.

## "ఎండలో విశ్రమించే బస్సులు"

ఆర్యా, పాలమూరు - వీరవాసరం కంకర రోడ్డు పాడైపోయి దాదాపు రెండు సంవత్సరములయింది. ప్రతి సంవత్సరమువర్షాకాలంలో పాలమూరు వద్దనే బస్సులు ఆగిపోవలసి వస్తున్నది. గోతులలో మట్టిపోసి, పైన కంకర వేసి పాసి, ఆకారం లేల్చారే కాని రోడ్డుకు గట్టిపని జరగలేదు. కొన్నిచోట్ల మట్టిపోస్తే తప్ప కాస్త కంకరన్నా పొయ్యలేదు. "కంకర దొరకటం లేదు. దొరికేవరకు అట్లా ఉండవలసిందే" అని చెబుతున్నారు. వేసవిలో బస్సులు జక్కుంటే దుమ్ముతేచి మనుషులను కప్పివేస్తోంది. లోకాన్నా ర్లు రోడ్డును పంచాయితీ నిర్వాహకులు తడిపించారు.

ఇక ఇప్పుడు వానాకాలం. మట్టి రోడ్డుకంటేగూడా అధ్వాన్నంగా ఈ రోడ్డు తయారయింది, మోకాటి లోతున దిగబడులోంది. "కణుకు, భీమవరం," "కోడేరు—భీమవరం," "సిద్ధాంతం—భీమవరం," "ఉప్పుటేరు—కోడేరు" బస్సులు ఈ రోడ్డుననే నడుస్తవి. కొన్ని బస్సులు ఊరి చివర గోతులలో నిలిచి పోతున్నవి. గ్రామస్థులు వాటిని మైకులిగి పంపిస్తున్నారు. గ్రామస్థులు లాగినా కొన్ని బస్సులు కదలటంలేదు; ఎండ నిచ్చేదాకా అవి అక్కడే విశ్రమించ వలసివస్తోంది. ఈ వానలకు బస్సులు ఊళ్లోకి రావటంలేదు. ప్రయాణికులకు ఇబ్బందిగా ఉంటోంది. రెండు సంవత్సరాలుగా ఇదే పరిస్థితి. ఎన్ని విజ్ఞప్తులు చేసినా ప్రయోజనం కనిపించలేదు. ఇకనైనా ఈ రోడ్డును మరమ్మతు చెయించ వలసినదిగా ప్రభుత్వానికి విజ్ఞప్తి.

రాచూరి లక్ష్మీనరసింహారావు, పాలమూరు.

## పన్నులభారంవల్ల ఆదాయం తగ్గుతుంది

ఆర్యా, ఆస్తులమీద యాత్రమీకాక రోజువారీ వాడకం వస్తువులపై కూడా పన్నులు విధిస్తున్నారు; మరోక రేంపు జీవనవ్యయం పెరిగిపోతోంది. అసలే అంతంతగా ఉన్న ప్రజాసామాన్యం ఆదాయం ఇంకా తగ్గిపోతుంది. వీటికి తోడు ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం నీటి తీరువను ఎక్కువచేసింది; మరో రు. 1 కోటి పన్నులను విధించాలని సంకల్పించింది. కేంద్ర, రాష్ట్రప్రభుత్వాలకు ఇక దాదాపు ప్రతిసంవత్సరమూ లోటు బడ్జెట్ వస్తుంది కనుక, ప్రతిసంవత్సరమూ కొత్తపన్నులు విధించక తప్పదని అంటున్నారు. ఇట్లా కొత్తపన్నుల వల్ల వచ్చే అదనపు ఆదాయాన్ని ఉపాధ్యాయులూ, నాన్‌గెజెటెడ్ ఉద్యోగులూ, గ్రామాధికారుల వేతనాలను ఎక్కువచేయడానికి వినియోగిస్తే కొంతలో కొంత సంతృప్తిగా ఉంటుంది. అటువంటిదేమీ చెయ్యడం లేదు. ఇది ఇట్లా ఉండగా పెద్దపెట్టున కొందరు పన్నులను ఎగవేస్తున్నారు; అవినీతి ఎక్కువవుతోంది; పరిపాలనా నిర్వహణఖర్చు అనవసరంగా పెరిగిపోతోంది. అవసరమైనవస్తువులపై పడని పద్ధతిలో పన్నుల విధానాన్ని రూపొందించి, ధరలు తగ్గే ఉపాయం కనిపెడితే తప్ప ప్రజాసామాన్యానికి సహాయమేమీ జరగబోదు. ఇందు కనుగుణంగా పన్నులపట్ల ప్రజలు తమ ఆక్షేపణ తెలియచేసే కృషి జరపవలసినదిగా స్థానికప్రజాసోషలిస్టు పార్టీసంఘాలను కోరుతున్నాను.

నెల్లూరు. జి. వి. కొండయ్య, ఆంధ్రప్రదేశ్ ప్రజాసోషలిస్టుపార్టీ కార్యదర్శి.

# అల్జీరియా గురించి అరబ్ రాజ్యాల వినతి

## అమెరికా నిరాకరణ

వాషింగ్టన్, జూన్ 28: అల్జీరియాలో ఫ్రెంచి దురంతాల పరిశీలనకు అంతర్జాతీయ సంఘం ఏర్పాటు చేయడంలో తోడ్పడాలనీ, ఫ్రాన్సుకు సైనిక సహాయాన్ని నిలిపివెయ్యాలనీ, యిటీవల పదకొండు అరబ్ రాజ్యాలు చేసిన విజ్ఞప్తిని అమెరికా నిరాకరించింది.

సూయజ్ లోనూ, అకాబాలోనూ ఇజ్రేలీ నౌకల రవాణాను నిరోధించే హక్కు ఈజిప్టుకు లేదని, అమెరికా ఈ అరబ్ రాజ్యాలకు తెలియపరచింది.

# అరబ్‌లతో శాంతి చర్చలకు సిద్ధమే

## ఇజ్రేల్ ప్రధాని పునరుద్ఘాటన

టెల్ అవీవ్, జూన్ 28: అరబ్ దేశాలతో శాంతి చర్చలకు ఇజ్రేల్ సిద్ధమేనని ప్రధాని డేవిడ్ బెన్ గురియన్ విలేఖరులతో చెప్పారు. యుద్ధ విరమణ సంధులు చేసుకొని ఇరాక్, సౌది అరేబియాలను, ప్రత్యేకించి ప్రస్తావించారు. శాంతి సాధ్యమేనని, వచ్చే పదేళ్లలోగా కూడా శాంతి ఏర్పడవచ్చని నమ్ముతున్నామన్నారు.

ఈజిప్టుతో చర్చలకు కూడ తాము సర్వదా సంసిద్ధమే నన్నారు.

# విదేశాలకు అమెరికా ఆర్థిక సహాయం

వాషింగ్టన్, జూన్ 28: అమెరికా అధ్యక్షులు శ్రీ ఐసెన్‌హోవర్ 1957-58 లో విదేశాల సహాయార్థం ప్రతిపాదించిన మొత్తం 386 కోట్ల 50 లక్షల డాలర్లలో ప్రాతినిధ్య సభ విదేశాంగ వ్యవహారాల సంఘం 60 కోట్ల డాలర్లు కోత పెట్టింది.

దీర్ఘకాలిక ఆర్థిక సహాయ కార్యక్రమాల విషయంలో అధ్యక్షుని అధికారం తగ్గించాలనికూడా తీర్మానం చేసింది.

[సెనేట్ 40 కోట్ల డాలర్లమాత్రమే కోత పెట్టింది.]

ఆయుధాల సహాయం మొత్తం 150 కోట్ల డాలర్లకు మించరాదని కూడా విదేశాంగ వ్యవహారాల సంఘం తీర్మానించింది. అంటే శ్రీ ఐసెన్‌హోవర్ ప్రతిపాదించిన ప్రమాణంకంటె 40 కోట్లు తక్కువ.

# అమెరికాలో ఉప్పెనలో 200 మంది మృతి

న్యూయార్కు, జూన్ 29: లూయీసియానా తీరంలో గురువారం ఉదయం గంటకు 105 మైళ్ళ వేగంతో తుపాను, దానితోపాటు ఉప్పెన వచ్చి, కామెరన్ అనే గ్రామాన్ని పూర్తిగా తుడిచిపెట్టి వేసింది. ఇందులో 200 మంది గ్రామస్థులు మరణించారు.

# బ్రిటిష్ గయానా "శాసన సభ" రద్దు

జార్జిటౌన్, జూన్ 28: బ్రిటిష్ గయానాలో చెడ్డీజగాన్ ప్రభుత్వాన్ని బర్తరఫ్‌చేసిన తరువాత గవర్నరు సభ్యులను నియమించి స్థాపించిన శాసనసభ రద్దయింది.

ఎన్నికలు ఆగస్టులో జరపడానికి ప్రభుత్వం నిర్ణయించింది.

